# జానపదుని జాబులు

[పల్లెటూరి లేఖలు]

బోయి భీమన్న

*

దేశికవితామండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
పునర్ముద్రణ
జూన్ - 1957
హక్కులు రచయితవి
వెల: రు 1-50




Desi Press, Vijayawada-2

---

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

ఇందులోని జాబులు చాలవరకు 'పల్లెటూరి లేఖలు' అనే పేరున ౧౯౩౨ లో 'జనవాణి' పత్రికలోనూ, కొన్ని 'జానపదుని జాబులు' అనే పేరున ౧౯౩౩లో 'ప్రజామిత్ర' లోనూ ప్రకటించబడ్డాయి. పట్నంలో కొంతకాలం చదువుకొని, బీదతనంవల్ల చదువు సాగించలేక తన స్వగ్రామంపోయి పల్లెటూరి పనుల్లోనే మునిగిపోయిన 'జానపదుడు' పట్నంలోని శ్రీమంతుడైన తనమిత్రునికి తన అవస్థలన్నీ వ్రాస్తాడు.

# వీరి ఇతర రచనలు

| | |
|---|---|
| పాలేరు | (నాటకం) |
| కూలిరాజు | ,, |
| అనసూయ | ,, |
| రాగోదయం | కావ్యం |
| మధుబాల | ,, |
| దీపసభ | ,, |
| మధుగీత | ,, |

నెచ్చెలీ !

నీకు హృదయం వుంటే—

నిన్న సాయంకాలం ఇంటికి వస్తున్నాను. సంజవేళ - నూటికి తొంభై తొమ్మిదిమంది గ్రామీణులు కొంపలుకూల్చే సంజవేళ - ఆయాసంగా ఇంటికి వస్తున్నాను.

గ్రామానికి ఒకమూల కల్లుపాకదగ్గర ప్రజలు కుమ్ములాడుతున్నారు. కేకలు, బొబ్బలు వేస్తున్నారు. చెల్లాచెదరవుతున్నారు. మళ్ళీ కూడుకొంటున్నారు. చిత్రగొల్లుగా వుంది.

రోజూ అంతే.

ఉదయం నుంచి - సాయంకాలం వరకూ రెక్కలు ముక్కలుకొట్టుకుంటూరు. రక్తం నీరుగా మార్చుకొని శ్రమిస్తారు. సాయంకాలానికి చేతికివచ్చిన బేడ డబ్బులూ కల్లు దుకాణంలో సమర్పించుకొని _ పీకలదాకా తాగుతారు.

వట్టిచేతుల్తో - తల గిర్రున తిరుగుతూంటుంది- తూలిపోతూ వుంటాడు, తాగుడు పిశాచి పూర్తిగా ఆవేశించిన దురదృష్టకార్మికుడు -

వట్టిచేతులతో ఇంటికిపోతే -

'ఆకలి ! ఆకలి !' పిల్లాడు అడలుతూంటాడు-ఆకలని.

తాగుబోతు - రెండు తన్నేసరికి, భార్య అడ్డంవస్తే, ఆమెకో రెండు - ఇక అడ్డంవచ్చేవాళ్ళెవళ్ళు ? ఇరుగు

పోరుగా - అంతా తప్పతాగి - వాళ్ళవాళ్ళ ఇళ్ళల్లో పెళ్ళా లిసీ, పిల్లలిసీ తన్నేవాళ్ళే !

కొంప దెయ్యాలకొంప అవుతుంది. ఏడుపులూ, పెడ బొబ్బలూ మిన్నుముట్టుతాయి. ఆకలి - దెబ్బలు - నిరాశ- దుఃఖమూ-తప్ప ఆ కుటుంబంలో సౌఖ్యం అనేది పేరుకు కూడా లేకుండా పోతుంది.

రోజూ ఇంతే-చాలమట్టుకు అన్ని కుటుంబాలలోనూ ఇంతే.

ఈ చిత్తగొల్లు అంతా చూస్తూ —— అసహ్యించుకుంటూ——ఒక్కొక్క జిల్లాలోనే పెట్టుకుంటూ వస్తున్నా రే ప్రొహిబిషన్, మా జిల్లాకు ఎప్పుడు వస్తుందో—— వస్తే ఈ త్రాగుడు మానేస్తారు ! ఈ పైశాచిక క్రియలు నశించి పోతాయి ! అప్పుడు ఈ గ్రామీణ కుటుంబాల్లో శాస్త్ర శాంతి —— సౌఖ్యం—— నెలకొంటాయి ! అని ఆలోచించుకుంటూ సాగాను నేను.

వీధిలో రెండుమూడు వేశానో లేనో- ఏకో దీనకంఠం రోదనస్తూన్న ధ్వని—— ఆ తావుకు నడిచాను.

ఎవరు ? ఒక రైతుబిడ్డ !

'అమ్మా, ఏం విచారిస్తున్నావు!' అన్నాను.

కళ్ళనీళ్ళు పైటకొంగుతో ఒత్తుకుంటూ——ఆమె—— 'కాదు నాయనా ! పూర్వం ఎప్పుడోనట, మాకు తెలీనే తెలీదు, మా మామగారికి, చిన్నప్పుడెప్పుడో, అప్పుపెట్టా

డట. వీడిఅప్పు తగులడిపోను—ఉన్న నాలుగెకరాలపల్లమూ రాయించేసుకున్నాడు—' కూలబడింది గుమ్మంలో—

'మా బ్రతుకుతెరువు పోయింది—చిప్పా, కర్రా చేతి కొచ్చాయి—' ఏడుస్తోంది.

తల్లినిచూచి పిల్లలిద్దరూ భావురుమని ఏడుస్తున్నారు.

ఇచ్చే అప్పు ఎంత? ఏ విత్తనాలకో— ఏ కోడె దూడని కొనడానికో— ఏ నాగలి చేయించుకోడానికో ఏ పాతికో, ఏభైయో, వడ్డీకి వడ్డీ - పదేళ్ళల్లో, ఈ మధ్య ఎన్నో తిరగరాతలు జరిగిపోతాయి, ఆ రైతుకు ఎంత మొత్తం చేసే సొంత ఆస్తివుందో అంత మొత్తానికీ, అసలీ ఫాయిదాలతో, పెరిగివుంటుంది.

సఖా! ఎన్నికొంపలు కూలిస్తేగాని ఒక్కకొంప కోటికి పడగెత్తగలదు?

ఎన్నికొంపల్ని కడుపులుమాడ్చి—ఏడ్పించితే గాని ఒక కొంప సుఖంగా వినోదించగలదు?

ప్రతినిత్యమూ—ప్రతీకొంపలోనూ ఏవో ఆవేదనలు, అంధకారాలు తారాడుతూనే వుంటాయి. కన్నీరొలకగూడని 'కలకంఠుల' కంట నిరంతరధారగా కన్నీరు ప్రవహిస్తూనే వుంటుంది.

నీవు చూడవుగాని— మీ పట్నాలలోనే కనబడతారు. కాయకష్టం చేసినాగాని కడుపునిండని స్త్రీలు, మట్టి తట్టలు మోసుకపోతుండే అభాగినులు కనబడతారు, ఏ కాయలో పోతూనో ఒకచూపు రోడ్డుప్రక్కకు విసిరితే,

కాని మా పల్లెటూళ్ళకి వత్తువా? మా పల్లెటూరి పడుచుల్ని ఒకింత పరికింతువా?

'ఘోరగభీర ఘనాఘన ఘోషల
కోమలచంచల రేఖలవేమీ—
మృత్యుభీకరాభీల తమస్సున
మిణుగురు బుగ్గల వెలుగేమీ—
నిజోద్రిక్త పూరుష పటుశక్తికి
నిదానమో ఈ రమణీరామము !'

ఈసత్యం—సత్యం కాదనను—మటుమాయమై వుంటుంది.

నీ కావ్యాలలో—నీ మేడలమీద—నీ ఉద్యానాలలో—నీ సినీమా నాటకరంగాలలో—నీకు పరిచయమయ్యే విలాసవతులనే ఆదర్శప్రాయులుగా అనుకుంటున్నట్టుంది నీవు. నీ కావ్యాలూ— నీఉద్యానాలూ స్వభావవిరుద్ధాలని అనను—ప్రత్యక్షాన్ని తెరగప్పే మోసాలు.

'రక్తం త్రాగుతున్నాం. రుచిగావుంది—ఎవరిదైతే మనకేం?' అనే తత్వం వాటిది. ఆరక్తం ప్రవహించివున్న శరీరాలు ఏమిటో—ఎవరివో— స్థితిగతు లెటువంటివో — అది మనకెలా లభించిందో — ఈ ఆలోచనలే వాటి కక్కరలేదు.

అదికాదు ప్రత్యక్షజీవితం— మా గ్రామాలువచ్చి చూద్దువా?

మలినమై, గుంటపడినకళ్ళు— ఎండిపోయి నొక్కుకుపోయిన చెక్కిళ్ళు— ఎన్నడూ నూనెరాయక, దువ్వక, చింపిరిపోయిన తలలు— .

కృశించిపోయి, ఎముకలు బైటబడ్డ రొమ్ములు—అరి, వెన్ను కంటుకుపోయిన కడుపులు, ఎండుకట్టెల్లాంటి కాలు చేతులు—

దరిద్రదేవతాభీకర స్వరూపాలు—

నీకు హృదయంవుంటే— నీవు నా స్నేహితుడవు కాబట్టి పేదల నిర్భాగ్యస్థితిని చూచి కన్నీళ్ళురాల్చే హృదయం నీలో వుండితీరుతుంది — అది శ్రీమంతుల, అధికార్ల, తుప్పుపట్టిన ఇనపగుండెల ముక్కు—కంపుకు బండదేరకపోతే- ఏడుస్తావు చూచి.

మానవులా వీళ్ళు? డార్విన్ పిచ్చివాడా? కోతులు- అందుండి మనుష్యులు - అంటాడు. వానరజాతులకు మధ్య మరోజాతి – మాౖగామీణజాతి-వుండనడే! డార్విన్ దేశంలో ఈజాతి లేదేమో! వున్నా-ఇంతదౌర్భాగ్యస్థితిలో లేదేమో!

ఈ సంశయం నాకు కల్గినందుకు నవ్వుతావు. అవును నీకు నవ్వుగానే వుంటుంది. ధనికత్వం ఈ నిరుపేద కార్మిక జాతినీ – రైతుసంఘాన్నీ – ఎంతగామాడ్చి, జీవచ్ఛవాల్ని చేసిందో ప్రత్యక్షంగా నీవుచూస్తే – నీకూ కలుగుతుంది ఈ సంశయం. కలగడమేకాదు – ఉండవలసినంత మానవత్వమూ నీలోవుండే – గుండెల్ని పట్టి పీకుతుంది, పీల్చుతుంది, చంపు తుంది.

మగవాళ్ళతో సమానంగా పాటుపడుతూ – పాటుకు తగిన ఫలితంలేక పస్తులుపడుతూ—

ఒంటినిండా బట్టలేని బికారిస్వరూపాలు-

ఆకలిబాధ–చెప్పరాని ఆకలిబాధ– రేపటిగతి ఏమిటా అని బెంగ – పిల్లల అటుమటు చూచి మనోవేద – కన్నీళ్ళు–ఎక్కడైనా పని దొరుకుతుందేమో అని పరుగెడుతూ–

ఈ కార్మికస్త్రీలు అనుభవించేది నరకం. ఈ బాధ, బాధ పెట్టేవాళ్ళకి కనిపించదు. వాళ్ళకు బాధ పెట్టడమే సరదా. ప్రతి ఉదయమూ రక్తం కళ్ళజూడక బతకలేని కసాయివాడికి గుండెమెత్తనా? కర్మఫలమంటాడు కాగుందు–గట్టుమీదకూర్చుని.

ఈ బాధని ఎవరూ వర్ణించరు, మనపట్నం కవులకి–ఉన్నమట్టుకు తిని ఊరూరు తిరుగుతూ, (కార్లమీదా–రైళ్ళమీదా) ఏ అమ్మాయిమీదో–ఏ కృష్ణుడి వలపు కత్తెగా ఉపమించుకోనో–పద్యా లల్లుకొనే మన పట్నంకవులకి–కనిపించదు. కనిపించినా శృంగారం కనిపిస్తుంది! బాధలో శృంగారం!!

ఈ బాధ–చావుబ్రతుకులమధ్య దరిద్ర పిశాచి భూతం ముళ్ళ గోళ్ళు గుండెల్ని పిసుకుతున్న బాధ–ఊపిరితిత్తుల్ని చింపుతున్న బాధ–కడుపులో ఆకటి పేగుల్ని పడిపెట్టే లాగి తెంపుతున్న బాధ–నీవుచూస్తే! దగ్గరగా రానక్కర లేదు–దూరానున్నంచే – చూస్తే!

అప్పటి కప్పుడు నీ భావాలు మార్చుకొంటావు. నీ ధనికత్వాన్ని వొదులుకొంటావు. నీ జమీందారీ గర్వాన్ని సడలించు కొంటావు, నీ పేద రైతుల–పేద కూలీల–ఇక్కట్లు బాపడానికి నడుంకట్టి ముందు కురుకుతావు. అప్పుడు జమీందారీ రైతుబిల్లు చెడ్డదనవు.

ఈ బిల్లునుగూర్చి నేనొక మాట మాత్రమే చెప్ప గలను. ఈబిల్లే చట్టమై అమల్లోకివస్తే - భారతదేశం గాంధీ జీని ఎలా పూజిస్తుందో-రైతులోకం శ్రీ ప్రకాశంపంతు లును అలా పూజిస్తుంది.

జమీన్ రైతులోకమే కాదు-మొత్తం రైతులోకమే అంటున్నాను. ఏమంటానా? జమీందారీ రైతుల ఇక్కట్లను తొలిగిస్తూ-ఈనాందారీ రైతుల మార్గంలోవున్న శిలాకంట కాల్ని తొలగించి ఈ చట్టం- స్నిగ్ధీకరిస్తుంది. రైతులు ఆ మార్గంలో కాలు పెట్టడమే తడవుగా-తమ గమ్యస్థానానికి ఒకతేజారడం జారిపోగలరు.

అంటే రైతు విప్లవానికి ఈ బిల్లు ఒక సోపానమని అంటాను. సంయుక్తరాష్ట్రాలలో ఇలాంటిబిల్లే- భూముల్లేని రైతులకు అప్లికేషనులపై భూస్వాముల భూమిలో కొంత భాగాన్ని తీసుకొని ప్రభుత్వం ఈయవచ్చు అనే బిల్లు-వస్తూ వుంది. ఇలానే దేశమంతటా.

రావలసిన అసలు విప్లవానికి ఈ రైతు విప్లవం ఒక దారి మాత్రమే. అది కార్మికవిప్లవం. కార్మికులకోసం ఒక్క ప్రొహిబిషన్ తప్ప కాంగ్రెసుప్రభుత్వం ఇంతవరకూ ఏమీ చేసివుండలేదు.

ఈ వూహాలన్నిటితోటి బుర్ర వేడెక్కిపోయింది. సౌఖ్యం లేని ఇన్ని కుటుంబాలు-ఇన్ని గ్రామాలు-ఇన్నికోట్ల మంది-ఎందుకు? ఎప్పుడు వస్తుంది ఆ సౌఖ్యం అనే మాయ వస్తువు?

ఇంటికి పోయాను.

'చిట్టీ?'

'ఆఁ'

'అమ్మ ఏదీ?'

'పొలంనుంచి రాలే'

'నాన్న?'

'నాన్నకూడా'

'దీపం వెలిగించలేదేం?'

'ఇంట్లోకి వెళ్ళడానికి-చీకటి-భయమేస్తోంది.'



ప్రియసఖా!

లేఖ ఆలస్యంఅయింది - కారణం వ్రాస్తాను-

భోగిరోజున - ఉదయం - స్నానంచేసి భోగిమంట దగ్గిరకి వచ్చేటప్పటికి రామారావూ, శాస్త్రి, కూర్చుని వున్నారు - మంట కణకణ మండుతోంది.

'అదేమిటి?' అన్నాను.

'ఏది?' అన్నాడు శాస్త్రి.

'ఆ బండి చక్రం'

'అది బండిచక్రంకాదు. కసి' అన్నాడు రామారావు.

కసి?

ఔను! కసి!

సఖా! ప్రేమ ప్రేమను పుట్టిస్తాది. ద్వేషం ద్వేషాన్ని కలిగిస్తాది.

కామందు రాఘవరావుతోటలో చాలా తాటి వాసాలూ వున్నై. వాటిని తా నెందుకూ ఉపయోగించడం లేదు.

'మా పశువులు మంచులోపడి కూనిగిలబడిపోతున్నై- ఒక పాక వేసికొంటాం - దయచేసి నాలుగువాసాలు ఇప్పించండి' అని అడిగితే 'లేవు - పొ'మ్మన్నాడు.

రాత్రి - అతడిదొడ్లోవున్న బండిచక్రాన్ని పొకటి లాక్కొని వచ్చి భోగిమంటలో పడేశారు మా మిత్రులు కొందరు.

అది కసి.

'అది కసి ఎలాఅవుతాది?' అని నీవు ప్రశ్నించవచ్చు.

ఆ తోట తను నాటాడా ?

కంచెలుకట్టి కాపాడాడా ?

నీరుపోసి పెంచాడా ?

ఇక- ఆ తోట 'నాది' అని ఎలా చెప్పుకోగలడు?

'బోలెడు డబ్బుపోసి కొన్నాడు' అంటావా ?

ఆ డబ్బు ఎక్కడిది ? తను పుడుతూ తెచ్చాడా ? తీశాడా గనుల్లోనుంచి ?

ముద్రవేశాడా ?

ఇక- 'ఈ డబ్బు నాది' అనడానికి ఏమి హక్కుంది?

ఏమీ హక్కులేని ఒక ఆసామీ—నాల్గు తాటివాసాలు ఈయడానికి నిరాకరిస్తే కసికాదూ ?

మాకే తోటలువుంటే ఇంకొకణ్ణి అడిగే కర్మం మా కెందుకు పడుతుంది?

కసి ! ఔను, కసి !

'కసి బలే బలేగా మండుతోంది!' అన్నాను.

'ఇదో మంటేనా ? ఇంకా, ఇంకా, మండాలి. విద్వేషం—అసమత్వం— నిరంకుశత్వం— స్వార్థం— ఇవన్నీ కాలి, బుగ్గు బుగ్గు అయిపోయేదాకా యీ జ్వాలలు ఆరకూడదు' అన్నాడు రామారావు.

అంటూ లేచాడు మంటదగ్గిరనుంచి. అంతట్లోకే మా కోడెదూడ ముందూ— ఒక దుడ్డుకర్ర వెనకా రివ్వున వచ్చాయి మా ప్రక్కకు.

కోడెదూడ నాదగ్గిర నిలుచుంది చేతిని నాకుతూ. ఆ కర్ర మంటలోపడింది.

శాస్త్రి పరకాయించాడు.

సంక్రాంతి—బంతిపువ్వులదండలో నాలుగుమువ్వలు గుచ్చి సరదాగా దూడ మెడలో కట్టాం— అది గంతులు వేస్తూపోయి రాఘవరావుతోటలో ప్రవేశించింది. ఆ ఫలితమే ఆ కర్ర !

కర్ర మంటలోపడి కాలిపోయింది. 'ఒకదాని కొకటి సాయం' అంటూ నిప్పు యెగదోశాడు రామారావు.

ప్రొద్దుఎక్కేకొలదీ పొగమంచు దట్టం అయింది.

మావీధి గడిస్తే చక్కని పొలాలు వుంటాయి—అక్కడి పెద్దగట్టుమీాదకు పోతే సరదాగావుంటాది ఎప్పుడైనాసరే, ఏవేళ అయినాసరే.

అక్కడికి పోదాం అని బైలుదేరాం. వాకిటినిండా నిండుగావున్నై ముగ్గులు. ఆ యిల్లాలు ఆ యింటిగుమ్మంలో అతిదీనంగా విచారిస్తూ కూర్చున్నది.

'పండగపూటా చస్తున్నామండీ! నా కూలీడబ్బులు ఇప్పించండీ!' అని దీనంగా ప్రార్థిస్తూవున్న ఒక కూలీని 'ఈ వేళ లేవు' పొమ్మని గర్జించాడు, అరుగుమీాద కూర్చున్న ఒక మహాభోగి.

ఆ చలిలో చెమటలు గ్రక్కుకొంటూ ఏవో మోసి కొనిపోతున్నాడు తన కామందుకి ఒక పాలేరు.

పనికి ఆలస్యంగా వచ్చాడని తననౌకర్ని కొట్టడానికి తరుముతున్నా డొక యజమాని.

'పండగపూట అయినా సంతోషంలేదు. ప్రజలు తమ సంతోషాన్ని ధనదేవతకి బలి ఇస్తున్నారు.'

'ఎంత క్రూరసంఘం ఇది! ఒకరి ఏడుపుతో మరొకరికి సంతోషం కలిగిస్తూంది. ఒకరి ఆకటితో ఇంకొకరి కడుపు నింపుతోంది. ఒకరి రక్తంతో వేరొకరికి సౌఖ్యసౌధాలు నిర్మిస్తోంది!

'దుర్భరం!' అన్నాడు రామారావు.

ఈలోపున మేము వీధిగడిచాం.

శాస్త్రి ఏదో ఆలోచిస్తూ వస్తున్నాడు. ఆయనభుజం మీాద చెయి వేసి 'రామారావు సంఘాన్ని తెగతిడుతున్నాడు' అన్నాను.

'తిట్టాలి – తిట్టవలసిందే – తిట్టడమే కాదు, నాశనం చేయవలె' అన్నాడు.

'ఏం?' అన్నా.

'ఈసంఘం మనకు పనికిరాదు. దీన్ని సంస్కరించడం కూడా తగదు.'

'ఏం?'

'సంఘం ముసిల్ది అయిపోయింది' అన్నాడు రామారావు— 'ముసలిదానికి కాంచనాభరణాలు పెడితేమాత్రం నవయౌవనాంగి అవుతుందా?'

'మనకు క్రొత్త సంఘం కావాలి. క్రొత్త ఉత్తేజం కావాలి. 'కొత్తజీవనం కావాలి. ప్రాత అనేది వుండనే కూడదు.'

'చూడు,' అన్నాడు శాస్త్రి ఎదుట చూపుతూ.

మంచు అప్పుడప్పుడే విడిపోతున్నది. ఆ మంచుతెర లోంచి పైరుచేలు కొంచెం కొంచెంగా కనిపిస్తున్నాయి.

'అటు చూడు' అన్నాడు: ఆ చలిలో యీా పండుగ రోజున ఆ చేలల్లో గడ్డికోసే ఆ కూలీబాలికలు.

ఆ ప్రాసాదంమీాద ఆ వెచ్చని యెండలో తడికురులు ఆరబోసికొనే ఆ సుకుమారులు.

'ఈ సంఘాన్ని ఉన్నది ఉన్నట్లేఉంచి యీ కూలీల్ని ఆ ప్రాసాదంమీదికి ఎక్కించగలవా ? ఆ సుకుమారుల్ని యీ పొలాల్లోకి దింపగలవా ?'

'అసంభవం'

'అయితే - ఆ క్రొత్తసంఘం ఎలా వుండాలి?'

'నీవు అడిగితే నేను చెప్పుతానా ?'

'పోనీ నేను అడిగా ననుకో.'

'నీవు అడిగినా చెప్పను.'

'పోనీ దాచుకో' అన్నాడు రామారావు.

'ఎప్పుడూ సంతోషంతోటే వుండేవాడివి, అలా వున్నావేం ?' అన్నాను రామారావుని.

'కసి' అన్నాడు.

మిత్రమా ! విజ్ఞానమూ ఉద్రేకమూ గల యువకులు పట్నాల్లో వుండిపోతూ ఆ భోగాలకి అలవడిపోతూవున్నారు గాని వారేగనక పల్లెటూళ్ళువచ్చి మా మా కష్టాలన్నీ కనులార చూస్తేఇంతలో వస్తుంది స్వర్గరాజ్యం.

కాని, ఏదీ ఆ అదృష్టం ?

ఎపుడు ఆ సుప్రభాతం ?

మిత్రుల సాన్నిధ్యం ఎంతో ఆనందంకూర్చింది నాకు ఆ వేళ. నీవూ వుంటే ఎంత బాగుండేదో !

భోగిరోజు ఇలా గడిచింది.

రెండో రోజున 'మా యింటికి పోదాం' అన్నాడు రామారావు.

'కాదు, మా యింటికి' అన్నాడు శాస్త్రి.

అంతట్లోకే మా అయ్యపిలిచి ఏదో పనిమీదమో - వెళ్ళిరమ్మన్నాడు.

మో—మా వూరికి ఆరుమైళ్ళ దూరంలోవున్న ఒక చిన్నగ్రామం. అదే తిరుపతిరావు వూరు.

'సరే. ఎవరింటికీ వొద్దు. అందరం కలిసి మో— వెళుదాం రండి' అన్నాడు శాస్త్రి.

సరే అంటే సరే అనుకొని బైలుదేరాం.

త్రోవ పల్రగట్లూ, డొంకసందులూ.

మా కెవరికీ కాళ్ళకి జోళ్లులేవు.

శీతాకాలం బెడ్డలు చురుకు చురుకు మంటూంటే శాస్త్రి, 'అమ్మో, అమ్మో' అనడం మొదలుపెట్టేడు.

రామారావుకాల్లో ఒక ముల్లు విరిగింది. ఒకచోట కూర్చున్నాం. ఇంకొక ముల్లుతెచ్చి ఆ ముల్లును తీయబోతే ఆ ముల్లుకూడా కాల్లోనే విరిగిపోయింది.

మేము పడుతూవున్న తిప్పలుచూచి ఆ దగ్గరే పని చేస్తూవున్న ఒక కూలీఅమ్మాయి తనముళ్ళగుత్తితో ఆముల్లు తీసివేసింది.

సఖా! ఒకనాడు కాలేజీకిపోతూవుంటే మధ్య వర్షం పట్టుకొని కొట్టికొట్టి విడిచిపెట్టింది. జ్ఞాపకంవుందా?

అప్పుడు మనం తడిసి— పుస్తకాలు దాచుకోడాని కైనా వీలులేక తటపటాయిస్తుంటే మనతోటే కాలేజీకి వస్తూవున్న ఒక అమ్మాయి— చేతిలో పెద్ద గొడుగు వుండి

కూడా, మనపుస్తకాల్ని అయినా తడిసిపోకుండా కాపాడడానికి వొప్పుకొన్నది కాదు— కాదూ ?

ఆమె నాగరిక నారీమణి,
ఈమె పల్లెటూరిపడుచు.
ఆమె విద్యావతి,
ఈమె విద్యావిహీన.
కాని,
ఇద్దరిలోని మానవత్వాన్నీ పోల్చిచూడు.
పట్నానికి అన్నీ అవయవాలే. కాని, హృదయంలేదు.

పల్లెకు హృదయంవుంది. సర్వాంగసౌందర్యం కొంత కొరవడినా బాధలేదు.

పల్లెటూళ్ళ సౌహార్ద్రాన్ని మెచ్చుకొంటూ ఆ ప్రయాణాన్ని సాగించాం.

'సంఘం హెచ్చు తగ్గులతో వుంది. ధనాన్ని ఒక ప్రమాణంగా తీసికొంటే, అత్యధిక ధనసంఘంలో అత్యల్ప మానవత్వమూ, అత్యల్ప ధనసంఘం (నిరుపేద సంఘం) లో అత్యధికమానవత్వమూ వుంటాయి అనుకొంటాను' అన్నాడు రామారావు—'నాగరికతను తీసికొన్నా అంతే'

'అది సర్వత్రా అనువర్తించదు' అని శాస్త్రి అన్నాడు.

ఈ విధంగా ప్రసంగించుకొంటూ, కుంటుతూవున్న రామారావును వెక్కిరించుకొంటూ, సాగిపోయింది—మా ప్రయాణం.

మో——చేరేటప్పటికి బాగా చీకటిపడిపోయింది.

తిరుపతిరావు ఇంటిదగ్గరలేడు.

'ఎక్కడికి వెళ్ళాడు?' అన్నాను.

'పొలం' అన్నది ఆయన చెల్లె.

'ఎంతదూరం' అన్నాను.

అంతట్లో ఆయనతల్లి వచ్చింది.

అతిథిసత్కారాలు పొందిన తర్వాత అరుగుమీద కూర్చున్నాం, తిరుపతిరావు వస్తాడని.

'అరుగులన్నీ పెచ్చు పెచ్చులుగా వూడివున్నై' అని శాస్త్రి అంటూ రెండుపెచ్చులు లాగాడు.

'మా ఇంటికి అరుగులే లేవుగా' అన్నాను.

'ఇవి పెచ్చులుకాదు-గాయాలు' అన్నాడు రామారావు.

'ఏమి గాయాలు?'

'సంఘం ఒక యుద్ధరంగం. అందులో విద్రోహవర్గం అమాయకమైన కూలీముతాన్ని గాయపరచింది – పరుస్తూ వుంది. ఆ గాయాలు ఇవి'

'అయితే ఇవి ఇంతలో మానవు.'

'మానవు. చక్కనివైద్యం ఏది?'

ఇలాగే కబుర్లుచెప్పుకుంటూ కూర్చున్నాం. రాత్రి పదకొండు, పన్నెండు గంటలయిపోయింది.

కోడి కూసింది-'తెల్లవారిపోయింది' అన్నాడు శాస్త్రి.

'సంక్రాంతి రోజుల్లో కోళ్ళు ఎప్పుడుపడితే అప్పుడు కూస్తవి నాయనా' అన్నది తిరుపతిరావు జనని-'అడుగో! అబ్బాయి వస్తున్నాడు.'

శిరస్సుమీద గడ్డిపరకలు - ముఖాన్నిధూళి - చిరు చొక్కా అంతా దూగర-

కళ్ళలో వేడి-నిట్టూర్పులో ఆయాసం-

వస్తూనే మా ముగ్గుర్నీ ఒక్కసారిగా కౌగలించు కొన్నాడు తిరుపతిరావు.

ఏమో—ఏంటో—ఎక్కడోలాగ కనిపించింది క్షణం -కాని,

ఆ మైమరపు క్షణకాలమే.

ఆత్మానందంతో ఆకలి తీరుతుందా?

అలసట పోతుందా?

కల్ల—కల్ల.

మోఁలో ఇంతవరకూ ఆగిపోవలసి వచ్చింది నేను. ఆ వూళ్ళో పోస్టాఫీసులేదు. తిరిగి ఇంటికివచ్చి వ్రాస్తున్నాను- ఇదే ఆలస్యానికి కారణం.

మో—విశేషాలన్నీ తరువాత లేఖలో-



నెచ్చెలీ!

క్షమిస్తావనే అనుకొంటున్నాను. లేఖ ఆలస్యమైంది. ఆలస్యానికి కారణం లేకపోలేదు. మీ పట్నాల్లోలాగ కాలం కరకట్టుగా నడవదు మా పల్లెల్లో. ఈ వేళ నిరుద్యోగం అయితే రేపు తీరికలేని పని—మళ్ళీ ఆ మరునాడు పని మందం-ఈ విధంగా వుంటుంది స్థితి. అందుచేత స్థిరంగా ఈ వేళ ఇది చేయాలి-ఆ వేళ అది చేయాలి—అని కార్య క్రమం తయారుచేసికొనడానికి ఏమీ అవకాశం వుండదు.

గ్రామాల్లో సాధారణంగావుండే యీ అస్థిరభావమే నీకు లేఖ వ్రాయుట ఆలస్యం చేయించింది. కాలం చాల విలువైంది. గ్రామాలు యీ విలువ గ్రహించడానికి ఇట్టి అస్థిర స్వభావం తొలగాలి.

మొన్ననే నీకు లేఖవ్రాయాలని అనుకొన్నాను. కాని, ఆ వేళ అంతా పని. ఒక్కక్షణమైనా తీరుబడి అయిందికాదు. ఆ రాత్రి వ్రాయాలని కలమూ, కాగితమూ పట్టుకొని దీపంబుడ్డి దగ్గిర కూర్చున్నాను.

'కిరసనాయిలపొగ కళ్ళలో పడుతోంది. కళ్ళు జబ్బు చేస్తాయి.' అని మాయమ్మ అన్నది.

'ప్రొద్దస్తమానమూ పనిచేశావు, పడుకోకూడదా!' అన్నాడు మామయ్య.

'అన్నోయ్! యీ లెక్క చెప్పి పడుకో' అంటూ పలకతీసికొని వచ్చింది మా చెల్లి.

అది రూపాయిల గుణకారం లెఖ్ఖ. లెఖ్ఖ చెపుతున్నాను. 'రూపాయల్ని అణాలు చేయాలంటే ఏమి చేయాలి?' అన్నాను.

మా చెల్లి ఆలోచిస్తోంది.

'దుకాణంమీదికి తీసుకవెళ్ళి మార్చాలి' అన్నాడు మా తమ్ముడు.

'కాదు, పదహారుపెట్టి గుణించాలి' అన్నది మా చెల్లి.

మాయమ్మ మా తమ్ముడిపక్షం అయింది.

'అయితే యీ రూపాయిని గుణించి అణాలుచేయి' అంటూ ఒకరూపాయిని దొర్లించింది మా చెల్లిదగ్గరికి.

నాకు ఆశ్చర్యం కలిగింది.

అచ్చట కలిగిన చమత్కారానికి కాదు నాకు ఆశ్చర్యంకలుగుత. ఇటువంటి చమత్కారాలెన్నో నిత్యమూ చూస్తూవుంటాం గ్రామాల్లో.

మాయమ్మ మా తమ్ముడి పక్షం అవలంబించినందుకు కాదు, నాకు ఆశ్చర్యం. వినోదంకోసం, బిడ్డలసాన్నిధ్యాన్ని తల్లులు అనుభవించే ఆనందాన్ని అనుభవించడంకోసం, ఆ విడ ఒకపక్షం వహించి మాతో తర్కానికి దిగింది.

మా యమ్మకు ఆ రూపాయి యెక్కడినించి వచ్చింది అనికాదు నాకు ఆశ్చర్యం కలుగుత. పదిరోజులు కష్టపడి పనిచేస్తే వచ్చినకూలి ఆ రూపాయి.

రూపాయి కంటికి కనపడితే ఎంతో ఆనందం. అందు కనే చిల్లర తీసుకోనక మినపకుడుంవంటి రూపాయి తీసు కొన్నాడు మా అయ్య.

ఆ రూపాయిని అందరూ తలకొక కాస్తసేపూ దగ్గర పెట్టుకొని ఆడుకొన్నారు దానితో.

కాని నాకు ఆశ్చర్యం కలిగించింది వేరొక విషయం. మనం అభ్యసించే విద్యకూ, జీవితంలో చేయబోయే పనికి ఉన్న అంతరం హఠాత్తుగా నా మనస్సుకు తట్టింది.

మనం నేర్చుకొన్నది, నేర్చుకొంటున్నది, రూపా యిని పదహారుతో గుణించి అణాలు చేయడమే.

కాని చేయవలసినపని రూపాయిని దుకాణం దగ్గిరకు తీసుకొనివెళ్ళి ప్రయోగించి చూపి పదహారు అణాలనూ లెఖ్ఖ పెట్టుకొని ఇంటికి రావడం. అంతవుంది అంతరం !

'చూశావా ? చదువులు చదువుతున్నాం. పట్నాల్లో ఒకరూపాయి ఒక దమ్మిడీలాగ ఖర్చుపెడతాం.'

చదువు పూర్తి అవగానే ఉద్యోగాలకు దేవుళ్ళాట మొదలు పెడతాం. అందరికాళ్ళూ పట్టుకొంటాం.

సఖా ! ఇన్నిత్రిప్పలూ ఎందుకు ? బ్రతకడానికి ! బ్రతికి ఎందుకు? మన స్వార్థాన్ని నింపుకోవడానికి! అంతేగా?

సంఘం ఏమైపోయినాసరే మనతో వారు ఎన్ని కష్టాళ్ళు పడుతున్నాసరే దేశం అధోగతికి దించుకొని పోతున్నా సరే మనకు చీమకుట్టిన చందం అయినావుండదు.

మన జిల్లాకాదు, మన తాలూకా కాదు, మన గ్రామం కాదు, మన ఇల్లువుండి, తక్కిన ప్రపంచం అంతా మునిగిపోతున్నా సరే, మనం లెక్కచేయం అంతే.

మిత్రమా! చదువుకొన్న వాళ్ళంతా తమ కష్టఫలాన్ని తింటూ పట్నాలలో సౌఖ్యాలు అనుభవిస్తూ, కులుకుతూ వుండడంచూచి పల్లెటూళ్ళు కన్నీరు విడుస్తున్నవి.

గ్రామోద్ధరణంఅంటూ పత్రికల్లో వ్రాసుకొంటే పని కాదు. ఉపన్యాసాలిస్తే పనికాదు. రోడ్లవెంట మోటారు కార్లలో నాలుగుసార్లు తిరిగి నాలుగువందలు భత్యాలు కొడితే పనికాదు. అవన్నీ రూపాయిని పదహారుచేత గుణించి నట్లే వ్యర్థాలు. కాగితంమీద కోట్లుకోట్లు సంఖ్యలు వేసుకొని 'ఇంతధనంవుంది నాకు' అని సంతోషించడం ఎట్లో, అవన్నీ అట్లే.

ఈ ఊహ ఆ క్షణంలో తట్టింది నాకు. ఆశ్చర్యం కలిగింది.

ప్రజాసముదాయం కోరే ప్రత్యక్షఫలం ఆడంబరం కాదు.

అంతట్లోకే 'వరికుప్పచేలో నీరుపడ్డది, నీవురావాలి.' అంటూ వచ్చాడు, ఒక రైతుకోటయ్య. ఆవేళ నీకు లేఖ వ్రాయడానికి వీలే చిక్కలేదు.

ఆ రాత్రి అంతా పొలాలలో జాగారం చేశాం.

కోతలు అయినవి. కొందరు కోతలు కోయగానే నూర్చివేసుకొంటారు. కొందరు కుప్పలు వేసికొని వేసవి కాలం తలసూపగానే చైత్రారంభంలో నూర్చుకొంటారు.

కుప్పలు చేలలోనే వేస్తారు. కుప్పలచుట్టూ పైరులు చక్కగా పెరుగుతూ వుంటాయి.

నీటి బోదెకు దగ్గరగావున్న చేలో కోటయ్య కుప్ప వేశాడు.

కాలువ యింకా యెండిపోలేదు. బోదె కన్నం తెగి కుప్పచేలో నీరు పడింది.

బోదె కన్నం కట్టివేసి చేలోపడ్డ నీరు పోయేలాగున పిల్లబోదెలు తీసి ఒక గట్టుమీద కూర్చున్నాం కోటయ్యా, నేనూ.

హాయిగా నక్షత్రాలు మెరుస్తున్నాయి. గుబురు గుబురుగా యెదుగుతూ, చల్లని గాలికి 'జోరు' మంటూ పైరుచేలు యెంతో ఆనందాన్ని కూరుస్తున్నాయి.

'పల్లెటూరి జీవితం యెంతో మనోహరమైంది!' అని అనుకున్నాను. కాని, 'పస్తులుపడాలి, కష్టాలకు ఓర్చుకోవాలి. ఈ రెండూ తప్పితే పల్లెటూరే ప్రశాంత జీవిత సౌఖ్యానికి పుట్టిల్లు.'

'కుప్ప పల్లాన్ని పడ్డది. ఆ మెరకచేలో వేద్దాం అనుకొన్నాను' అన్నాడు కోటయ్య. 'అంతర్వేది వెళ్ళగానే మార్చేయాలి.'

'అంత తొందర యేమివచ్చింది? సంవత్సరాదికి మార్చుకోవచ్చు' అన్నాను.

'అబ్బే, పనులువచ్చి తలమీద తన్నుతాయి. ఇంట్లో ఒక పింగాణీచిప్ప అయినాలేదు అమ్మడానికి. అన్నీ మట్టిముంతలే' అన్నాడు.

సఖా! కష్టం వొకళ్ళది, ఫలితం మరొకళ్ళది.

పేదల నోళ్ళుకొట్టి, కడుపులుమాడ్చి, ఉన్నదంతా ఊడ్చుకపోయి ఏమిచేస్తారో తెలుసా? బేంకులలోనూ, ఇనుప పెట్టెలలోనూ కుప్పలు పోసికొని కూర్చుని అనుభవిస్తారు సర్వభోగాలూను.

ఎప్పుడు తొలకరిస్తాది అని కళ్ళువిప్పి కనిపెట్టుకొని వుండి–

ఎప్పుడు కాలువకు నీరు వొస్తాది అని రాత్రింబవళ్లు మననంచేసి–

మడిదున్ని విత్తనాలుచల్లి–నీటికొరకూ–కూలికొరకూ యితరులతో పోటీలుపడి–

ఆకుమళ్ళు పశువులు త్రొక్కి తినివేయకుండా రాత్రింబవళ్ళు పొలాలలోనే, వట్టి నేలనే పండుకొని కాపలాకాచి–

కుట్టే జెర్రెలకూ, పొడిచే తేళ్ళకూ, కరిచే పాములకూ శరీరాన్ని అర్పిస్తూ–

విసుగూ విరామమూ లేకుండా పొలాలకు నీరుపెట్టి, దున్ని, ఊడ్చి–

వర్షం అనక, బాడిబందలు అనక–పైరుల్ని–నిత్యమూ చూస్తూ, కాస్తూ–

ఎరువులువేసి, కలుపులుదీసి, పంట పండించి–

పంటను మెలుకలు, చిలుకలు తినివేయకుండా జాగ్రత్తచేసి–

పంటను కైలుచేసి-ధాన్యం రాసులుపోసి-తమ కడుపులు కాలుతూవున్నా, కన్నీళ్ళు కారుతూవున్నా-

మిత్రమా! ఇనాందారులకు ఫలితం అంతా అప్పగించి వట్టిచేతులు నలుపుకొంటూ యిండ్లకుపోయి పస్తులు పడే రైతుల దీనగతి యెవరికి హృదయం కరిగించదు ?

చాలకాలం గడిచిపోయింది నాకు యీ వూహాలోనే. కోటయ్య యేమి ఆలోచిస్తున్నాడో నాకు తెలియదు.

ఇద్దరమూ తెలివొంది చూచుకొనేసరికి మంచుచేత మా తలలు నానిపోయినై. పోదాంపద అని లేచాడు కోటయ్య.

రాత్రి అంతా నాకు నిద్దర పట్టలేదు. పైగా అమితమైన చలికూడాను. చలిమంటలు వేసుకొంటూ కబుర్లు చెప్పుకొంటూ ఆ రాత్రి గడిపాం.

ఆ మర్నాడు నిద్దుర బద్ధకంచేత (ఏమీ పనిలేకపోవడమే బద్ధకానికి కారణం) నీకు లేఖ వ్రాయలేకపోయాను. ఆ రాత్రి అన్నం తినకుండానే నిద్రపోయానట, మాయమ్మ అన్నానికి యెంత లేపినా లేచాను కానట.

రేపంతా పనివుంది. మెట్టదుక్కులు వచ్చాయి. తోటల్లో అరకలు కట్టాలి. రేపు మూర్తిగారి యింటికి వెళ్ళాలి అనుకొంటూన్నాను. ఎలావుంటుందో.

ఇంతవరకూ నా లేఖ యెందుకు ఆలస్యమయిందో వ్రాశాను. అసలు నీకు వ్రాయాలి అనుకొన్న సంగతి వ్రాయనేలేదు.

క్రిష్టమసు వస్తూంది. క్రిష్టమసుకూ సంక్రాంతికీ కలిపి కాలేజీకి సెలవులు యిస్తారు. నేను యీ యేడు చదువు సాగిస్తే నిన్ను మా వూరు తీసుకొని రావాలి అనుకొన్నాను. కాని పురిటిలోనే సంధి కొట్టింది నా చదువుకు.

డబ్బులేని చదువు యిబ్బందులచేటు. వచ్చేయేడైనా చదువుతానో చదవనో. కాలం జరిగిపోయేకొలదీ స్నేహాలు ప్రాతబడిపోతూ వుంటాయి. క్రొత్తపరిచయాలు కలిగేకొలదీ ప్రాత పరిచయాలు అడుగునపడిపోతూ వుంటాయి. ఇది ప్రపంచ స్వభావం.

కనుక యీ సెలవులకు మా వూరు వస్తావనే అనుకొంటున్నాను.

నీవంటి ఆర్ద్రహృదయుడు పల్లెటూళ్ళువచ్చి ఇచ్చట ప్రజలుపడే కష్టాల్నీ—కష్టాలు తొలిగిపోతే పల్లెటూళ్ళు మానవసంఘానికి ఈయగల ఆనందాన్నీ—చూస్తే యెప్పటికైనా మంచిది.

ఏ విషయము వెంటనే తెలపాలి. నారింజపళ్ళూ, వెలగపళ్ళూ, కొబ్బరి కురిడీలూ జాగ్రత్తచేసివుంచుతాను. తప్పకుండా రావాలి. సెలవు.



చెలీ!

క్షేమం

రాత్రంతా కుప్పదగ్గిర పండుకొన్నాను. జోగయ్యా ఒక మామూలు రైతు-సుబ్బయ్యా ఒక ఈనాందారు దగ్గిర పాలేరు-ఈ ఇద్దరూ నాకు మిత్రులు.

ఈ వూసూ ఆ వూసూ చెప్పుకొంటూ కొంతసేపు కాలం గడిపాం. ఒకరి కష్టాలొకరికి తెలుపుకొంటూ సాను భూతిని ప్రకటించుకొంటూ గడిచాయి కొన్ని గడియలు.

కుప్పదగ్గిర-కుప్పకు ఆనుకొని-ఒకగట్టు. ఆ గట్టుమీద కొబ్బరి ఆకుల చివళ్ళతో కట్టిన ఒకపాక-ఆ పాకలో మేము పండుకొన్నాం.

వట్టిగడ్డె మాకు పరుపులు. కొబ్బరితుంటలే తలదిం డులు. కొబ్బరిచాపలే దుప్పట్లు.

వెల్లకిల పండుకొన్నాం ముగ్గురమూ. మా పాకలో నుంచి మిణుకు మిణుకు నక్షత్రాలు ఎంతోహాయిగా వున్నై.

ఆ నక్షత్రాలు తొంగిచూచే సందుల్లోనుంచి చల్లగా మంచుసోన దిగజారుతోంది.

చలి ఊహుహూహూ అనిపిస్తూంది. మా పంచెలు ఆ చలిని ఆపలేక పోయినై.

కట్టుకొన్న పంచెలు విప్పి కప్పుకొన్నాం. చలి ఆగ లేదు దగ్గిరవున్న కొబ్బరిచాపలు మీదకు లాక్కొని వాటి మీద వట్టిగడ్డి కప్పుకొన్నాం.

'ఈవేళ మంచి చలి' అన్నాడు సుబ్బయ్యా.

'ఈవేళ తెంగాని మొన్న వేసింది శీతలం' అన్నాడు జోగయ్యా. 'అరకపట్టుకొని దున్నుతూంటే మేడితోకకు చెయ్యి అంటుకు పోయింది '

'ఈ వేళకూడ అలాగేవుంది' అన్నాను నేను. 'ఆపైని ఇంకో నాలుగాకులు వెయ్యావలసింది.'

'అప్పుడే నా వొల్లంతా నానిపోయింది' అన్నాడు సుబ్బయ్యా.

'ఇంటికాడ హాయిగా పండుకోక-ఈ నరకం వంటి మనకి ?' అన్నాడు జోగయ్యా.

'ఈ తప్పు మనదికాదు కాబట్టి'

'మనదైతే ?'

'మనకామందులాగే హాయిగా శాలువా ముసుగు పెట్టుకొని గుర్రుపడుతూ వుందుము, ఈపాటికి డాబామిద్దె గదిలో.'

'అప్పుడు మన ప్రాణానికి ఇంకొకళ్ళు వచ్చేవాళ్ళు ఈ చలిలోపడి మనలాగే'

'వడిస్తే పోనీ'

'అలాగే అందరు యజమానులు. మనకామందును మనం అసహ్యించుకొంటున్నాం. మనం కామందులమైతే మనచేతిక్రింద పనిచేసేవాళ్ళు మనల్నిఅసహ్యించుకొంటారు' ఈ మాట కొంచెం రైతునని చెప్పుకొనే జోగయ్యా అన్నది.

జోగయ్యామాటని సుబ్బయ్యా ఎదిరించాడు. 'అందరూ యజమాన్లే అయితేనో ?' అని.

'అవలేరు' అని జోగయ్య అన్నాడు. సుబ్బయ్య నా చేతిని గోకాడు. 'పోనీ అయ్యారు అనుకో. అప్పుడు?' అన్నాను.

'ఎలా అవుతారు?'

'ఎందుకు అవరు?'

'కృష్ణారావుగారి పంద్రెండువందలఎకరాల్నీ ప్రభుత్వం వశపరచుకొని కుటుంబానికి ఐదు ఎకరాలచొప్పున ఇస్తే? అలాగే హిందూదేశాన్నంతట్నీ విభాగిస్తే ఎందుకు అవరు?' అన్నాను.

'అబ్బో! ఇక న్యాయం వుండక్కర్లేదూ?' అని జోగయ్య అన్నాడు.

'ఇప్పుడేమంత అఘోరిస్తుంది న్యాయం?' అని సుబ్బయ్య అన్నాడు.

అని,

'కష్టం వొకళ్ళది, ఫలం మరొక్కళ్ళది. ఇదేనా న్యాయం? తను స్వయంగా సాగుచేసుకోలేనంత భూమి ఈనాందారుకెందుకు? కష్టపడి-భూమిని బాగుచేయగలిగే మాకు ఏమీ (ఇళ్ళస్థలంఅయినా) లేకపోవడం దురన్యాయం కాదూ?' అంటూ ఉపన్యాసం సాగించాడు సుబ్బయ్య.

'అయితే ఇప్పుడేమంటావు?' అన్నాను సుబ్బయ్యని.

'ఏమన డానికి ఏముంది? నీవు మొన్న పత్రికలో చదివావు కావూ అందరికీ సమానత్వం రావాలని? అది రావాలి' అన్నాడు.

'అది ఎలా వస్తుంది? మాటలతో వస్తుందా?' అన్నాను.

'సాధించాలి'

'ధైర్యం–సాహసం వుండాలి. మనమందరమూ వీరులు అయిపోవాలి' అన్నాడు.

'అమ్మో పల్లెటూళ్లు!' అనుకొన్నాను.

ఇంతట్లోకే కుప్ప బెదబెదలాడింది. ఏంటా అని పరకాయించాం. ఏంటో చల్లగా కనుపించి కుప్పచాటున దాగింది.

'అమ్మో' అని ఉలిక్కిపడ్డాడు సుబ్బయ్య.

'బలేధైర్యంవుంది నీకు! సమత్వం సాధించేవీరుడివి కాదూ?' అన్నాడు జోగయ్య.

లాంతరు తీసుకొని కుప్ప వెనకాలకు వెళ్ళాను. అది తుర్రుమని పారిపోయింది.

'ఏమిటది?' అని సుబ్బయ్య అడిగాడు.

'మా క్రొకోడిదూడ' అన్నాను.

'కుప్పలాగిందా?'

'లేదు. లాగే ప్రయత్నంలో వుంది పాపం!'

అదికూడా మన సుబ్బయ్యలాంటిదే. సాధించడానికి వచ్చి పారిపోయింది!

'అది ఎక్కడికి పోతాదో–కట్టివేసివస్తా'నని లాంతరు తీసుకొని బైలుదేరాను.

సుబ్బయ్య-జోగయ్య అనుకొన్నమాటలు మాటి మాటికీ జ్ఞాపకం వస్తూనే వున్నై.

'పల్లెటూళ్ళలో విప్లవశక్తి పుట్టింది. అది లోలోపల కుమ్ములుతోంది అగ్నిపర్వతంలాగ, ఎప్పుడో ప్రేలకతప్పదు.' అని అనుకొంటూ తిన్నగా మందలోకి వెళ్ళాను.

తల్లిదగ్గర నిల్చుంది దూడ. తల్లి దాన్ని నాకుతుంది ప్రేమతో.

తోటంతా ప్రశాంతంగావుంది. మందలో మా అయ్య పండుకొని వున్నారు.

మెల్లగా దూడని కట్టివేసి-లాంతరు తగ్గించి-ఆ మంద లోనే కూర్చున్నాను చాలసేపు విశ్వవిలాసాన్ని వీక్షిస్తూ.

సుఖంగా నెమర వేస్తూ పండుకొన్న ఎడ్లు.

కూలీలూ, పాలేళ్ళూ, అంతా కష్టాలూ మరిచిపోయి సుఖస్వప్నాలు కంటూ వుంటారు వారి వారి గృహాల్లో.

ఎంతోమంది కష్టజీవులు ప్రేమసల్లాపాల్లో ఆనందం పొందుతూవుంటారు ఆ సమయాన్ని.

దుఃఖితులు జీవితార్తుల్ని మర్చిపోయి నిద్రిస్తూ వుంటారు.

ప్రకృతి ఎంతహాయినీ—ప్రశాంతాన్నీ కూరుస్తుంది జీవితానికి!

ఆహా! 'రేపు' అనేది లేకపోతే——!

'రేపు అనేది లేకపోతే ఎంత బాగుండును!' అను కొన్నాను.

'రేపు అనేది నిజంగా లేదేమో' అని భ్రమకలిగింది. కాని-భ్రమ.

ప్రొద్దుపొడుస్తుంది తిరిగి, తప్పదు.

ఎద్దుల్ని తోలుకొనిపోయి అరకలు కట్టాలి.

అవి అలసి నడవకపోతే కర్రలతో వాటిని కొట్టాలి.

కార్మికులు, కర్షకులు, తిరిగి వారివారి పనులకుపోవాలి.

కష్టపడాలి.

దుఃఖించాలి.

అబ్బ! ఆ 'రేపు' అనేది రాకపోతే ఎంత హాయిగా వుంటుంది ప్రాణం!

సఖా! అలాంటి వూహాలతో చాలసేపు ఆ అంధకారంలో కూర్చున్నాను.

మానవులకు - అందులోనూ పేదలకు - ఎంతకష్టం దాపురించింది!

తమతోబాటు ఎన్నిజీవుల్ని, ఆవుల్నీ, ఎద్దుల్నీ ఇంకా ఎన్నో జంతువుల్ని కష్టపెడుతున్నారు తమ స్వార్థానికి!

ఈ దీనజీవికలు తరించే మార్గంలేదా వొకటి?

'సమత్వం రావాలి. సర్వసమత్వం రావాలి' అంటూ వదో గింగురుమన్నది నా చెవిలో.

ఇక అక్కడ వుండలేక లాంతరు తీసికొని కుప్పదగ్గిరికి బైలుదేరాను.

త్రోవలో రెండు లేగదూడలు ప్రక్క ప్రక్కగా పండుకొని నెమరువేసి కొంటూన్నవి.

రెపరెపలాడుతూ కూస్తో, రెండు గుడ్లగూబలు ఒక చెట్టుమీదనించి ఇంకొక చెట్టుమీదకి ఎగిరిపోయినై.

చలికారం ఎంత దివ్యమైంది!

చలికారంలోనే సర్వసమత్వం వుంది.

నీవు ధనవంతుల బిడ్డవు, నేను నిరుపేదను.

నీవు నిత్యపట్నవాసివి, నేను పల్లెటూరివాడిని.

నీవు భోగలాలసుడవు-నేను కష్టజీవిని.

కాని,

మనస్నేహం ఎంత హృదయపూర్వక మైంది!

సర్వసమత్వం స్నేహంలోవుంది-సత్యం.

ఇప్పుడు సంకుచితంగావున్న స్నేహాన్ని విశ్వవ్యాప్తం గావించాలి అంతే.

అప్పుడు కలుగుతుంది సమత్వం.

అది శాశ్వతంగా వుంటుంది ఆనందకరమై.

కుప్ప సమీపించాను. పాకలో ఆ యిద్దరూ నిద్ర పోతూ వున్నారు.

మంచు కురుస్తూవుంది జోరుగా.

నేనుకూడా గడ్డిలోదూరి కూర్చున్నాను.

ప్రజలకు కష్టాలు నశించిపోవాలి. సౌఖ్యాలు శాశ్వతంగా ఉండాలి.

ఈ కుప్పదగ్గర మేమెందుకు చలిలో వణకుతూ బాధ పడుతున్నాం? కుప్పను దొంగలు దోచుకోకుండా చూడడానికి.

దొంగలెందుకు దోస్తారు? తిండిలేక. తిండిగలిగితే దొంగలే వుండరు.

తిండిగలిగితే మేము ఈ కష్టాలు పడనేపడం.

అందరికి కడుపులు నిండుగా తిండిదొరికే అవకాశాలువుంటే చాలు-సమత్వం దానికదే వస్తుంది.

ముందు ప్రపంచాన్నంతా ఒకే స్నేహదృష్టితో చూచే గుణం సంఘానికి కలగాలి. ఈ వూహాల్లో ప్రపంచమంతా ఒక్కసారి చుట్టి వచ్చింది మనస్సు. వివిధ దేశాల్లోనూ సమత్వానికీ, అసమత్వానికీ, నిరంకుశత్వానికీ దాస్యానికీ-భాగ్యానికి పేదరికానికీ-ఎక్కువకూ తక్కువకూ-గర్వానికీ అడకువకూ-పోరాటం ఏవిధంగా జరుగుతున్నదో ఒక్కసారిగా కళ్ళకుకట్టినట్టు కనిపించింది.

కాలేజీలో అసమత్వానికి చెందిన రాముడూ, గర్వానికి చెందిన డేవిడ్డూ, నిరంకుశత్వానికి చెందిన రాఘవరావూ, భాగ్యానికి చెందిన నీవూ, పేదరికానికి చెందిన నేను, అడకువకు చెందిన మహమ్మద్‌ఖానూ- ఎంత స్నేహంగా వుండేవాళ్ళమో జ్ఞప్తికి వచ్చింది.

'ఆ స్నేహం కాలేజీ వెలుపల ఎందుకు వుండదు? అది విశ్వవ్యాప్తం ఎందుకుకాదు? సర్వసమత్వాన్ని సాధించడానికి మారణవిప్లవమే యేల? శాంతివిప్లవం చాలదా?' అని అనుకొన్నాను.

ఆ స్నేహమంతా తలుచుకొని అందులో ప్రత్యేకంగా నీతోటి స్నేహాన్ని జ్ఞప్తికి తెచ్చుకొనేప్పటికి శరీరం పుల

(5)

కాంకురితం అయింది. ఏదో తెలియని ఆవేశం ఉప్పొంగింది హృదయంలో.

ఆ పాకలో గడ్డిక్రింద దాచిన పుస్తకం, పెన్సిలుతీసి ఈ కిరసనాయిలుబుడ్డి లాంతరు వెలుగులో ఈపద్యం వ్రాశాను.

'నాలుగింటికె కళాశాల మూసిననాటి
        పైరు చేలల్ల విహారములును,
సెలవులలో పెద్దక్కచెలగు సంజలనాటి
        వైనతేయ తటోపయానములును,
వెన పుస్తకములపై విసుగుపుట్టిననాటి
        నెలవైన వెన్నెల పులినములును,
పువ్వుకో కాయకో, పుట్టువాదుల నాటి
        క్షణికమ్ములగు ప్రేమకలహములును

మరపునకురావు, నెచ్చెలి, మరపురావు,
బ్రతుకుతెర్వుల వెన్నంటి వచ్చుతుదికి.
జీవితపథాలు వేరయి, జీవయాత్ర
వెడలి దూరమైపోయెడి వేళకూడ.

ఒంటరినె అయి ఇంట కూర్చున్నయపుడొ
ఏమియును తోచకొక దారినేగునపుడొ
వేసవులలోని సాయాహ్నవేళలందు
మొక్కల కుదుళ్ళుతీర్చి నీరోయునపుడొ
కలలవలె పూర్వరీతులు కానుపించు
కలత కన్నీరు వేడిగా కారిపోవు.'

సఖా! అది చూడడానికి కొబ్బరి చిగుళ్ళ పూరిపాక. పట్నంవాళ్ళ కంటి కది అసహ్యంగా, తేలికగా కనిపిస్తుంది.

కాని, మాకు అది దివ్యభవనం, చర్చాసౌధం, సౌఖ్యవేదిక, విహారసీమ.



ప్రియ మిత్రమా!

అనారోగ్యంగా వుంది. ప్రొద్దుటినుండీ ఇంట్లోంచి బైటికి పోలేను.

సాయంకాలం అబ్బాయి వచ్చాడు-పొలం పోదాం రమ్మన్నాడు. నీరసంగావుంది-రాలేను-అన్నాను.

'తావులు తేలే చల్లని తేటగాలీ - హృద్యంగా కల కల్లాడే పచ్చనిపైర్లూ-హృదయాన్ని ఆకర్షించే తోటలూ-వుండే గ్రామంలో ఇంట్లోకూర్చోవడం నరకప్రాయం కాదూ ?' అన్నాడు.

'ఆరోగ్యం సరిలేదు.'

'ఆరోగ్యం సరిలేక పోవడం యువకులికి కాదు-'

నీడగావున్న మార్గం విడిచి (చలివేస్తూంది) ఎండలో నడిచాం.

అవ్వూనూ, ఈవ్వూనూ చెప్తూ నాకు వుత్సాహాన్ని కలిగించడానికి యత్నిస్తున్నాడు అబ్బాయి-

'ఇంటికాడ-ఆ జ్వరంకంపు ప్రకాశ్-ఆ వూపిరితిరగని చీకటిగదీ-ఆ పొగ చూరుగాలీ-'

'చెరువుగట్టుకు వెళ్ళితే-ఆ విడిచే చెంగల్వాలూ-ఆ మొగిచే తామరపూలూ-ఆ ఆడుకొనే చిరుకెరటాలూ-ఆ పాడుకొనే నీటిపక్షులూ-'

అంటూ.

పొలంపోయాం-చెరువుకట్టుమీదికి. ఎండలో నిల్చొన్నాను. ఆ సాంధ్యాముగ్ధ సౌందర్యాన్ని చూస్తూ-అబ్బాయి చెరువులో దిగాడు పువ్వులు కోయడానికి.

ఆ పాటల్లో-ఆ ఆటల్లో- ఆ సుందర ప్రకృతివాడిలో పూర్తిగా నిద్రపోయాను, నేను మానవుణ్ణి అని మరిచి !

కలలు కంటున్నాను, అంతా ఆనందమే - అంతా సౌఖ్యమే-అని నా అనారోగ్యాన్ని విస్మరించి !

కీర్తిస్తున్నాను-ఆ ఆనందాన్ని నాకిచ్చిన ఎవరో్ని-నాకష్టజీవిత దుఃఖాన్ని కప్పిపుచ్చుకొని !

వెర్రివాణ్ణి.

సఖా ! ఆ ప్రక్క-చేలో కష్టంతో పనిచేసుకొంటూ వున్న రైతు ఈ ఆనందాన్ని అనుభవిస్తూ వున్నాడా ?

ఆ చెరువుమూలలో పశువుల్ని మేపుకొంటూవున్న ఆ చిన్నకుర్రాడు ఈ సాయంసంధ్యా ప్రకృతిలో ప్రమోదిస్తున్నాడా ?

గడ్డిబుట్ట తలపై పెట్టుకొని-నీరసంగా ఇంటికిపోయే ఆ పల్లెటూరిపడుచు, ఈ ముగ్ధ సౌందర్యంలో తన్మయత్వం పొందుతుందా ?

లేదు-లేదు.

నావంటి అనారోగ్యులికీ-నీవంటి సుఖభోగులికీ-ఇంకా ఎవరోవంటి పనిలేలివారికీతప్ప, కష్టపడిజీవించే సార్థజీవులికి ఈ సౌఖ్యమూ-ఈ ఆనందమూ-అనుభవించడానికి తీరుబడి వుండదు ! సౌకర్యాలు లేవు !

దుర్గతి !

'ఏమిటి ఇలావున్నావు ?' అన్నాడు అబ్బాయి భుజం మీద చేయివేస్తూ-చేతిలో పువ్వుల్ని ముఖంలో పెడుతూ.

'నిరాశ' అన్నాను.

'ఎందుకు నిరాశ? ఏమినిరాశ? మరణం ముందు-నిరాశ వెనుక.'

మరణం ముందు-నిరాశ వెనుక?

'కావచ్చును కాని, సఖా! ఈ సంఘుక్రమం వొకరికి నిరాశగా-మరొకరికి పేరాసగా వుంది.

'అటువిను' అన్నాను.

నవ్వే పువ్వుల పెదవుల్లోనించో - కేరేకెరటాల గొంతుల్లోనించో-పక్షుల కదిలే నాలుకలమీద నించో-ఒక పాట వినిపిస్తూంది.

ఈ పల్లెచాలు నా కీ పొలముచాలు నా
కీ పాక చాలునోయీ!
ఆకలీ, అధికారి అదరుపాటూ నన్ను
అంటరాగూడదోయి!

పాటవచ్చిన దిక్కు-నడిచాం.

ఆ పూచిన బాడిదపు చెట్లక్రింద-ఆ పొలం అంచున ఒకపాక-ఆ పాకలో ఒక రైతుబిడ్డ.

'కష్ణా! పాటలు పాడేస్తున్నావే;'

అన్నాను వెళుతూనే.

చూస్తూనే ఆ కుర్రాడు లేచివచ్చి చేతిని గట్టిగా పట్టుకొని మెత్తగా గిల్లాడు.

'ఏం? వేడిగావుంది చేయి!' అన్నాడు.

'జ్వరంగా వుంది, ఇంటికిపోతాం-పాటలుపాడు- మా

వద్దు-ఏనాటికైనా మన పాటల్ని లోకం వినకపోతుందా ?' అన్నాను 'పొలం కాపలా కాస్తున్నావా ?'

'ఔను'

నిరాశకాదూ ?

అబ్బాయి ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

'నిరాశకాదూ ?' అన్నాను. ఆ కుర్రాడి చదువు వీధిబడితోటే ముగిసింది. కాని ఎంతచక్కని పాటలు వ్రాస్తాడనుకొన్నావు ? ఈ పల్లెటూళ్ళో-ఈ దినదిన భుక్తికోసం-ఈ ఆకటిచిచ్చు ఆర్పుకొనే నిమిత్తం కష్టిస్తూ, నష్టిస్తూ-వ్యర్థం అయిపోవలసిందేకాదూ అతని జీవితం ?

'ఓ అంటే నా రాని షోకిల్లాలంతా విద్యాభ్యాసాలకనీ-విదేశాలకనీ-(వాళ్ళ పెద్దలు వుద్యోగస్తులో- కోటీశ్వర్లో అయివుండటంచేత) లక్షలకొలది డబ్బు వ్యర్థంచేస్తూవుంటే -ఈ అజ్ఞాత కాళిదాసులూ, యీ అనామక మహాత్ములూ ఈ పల్లెటూళ్ళలో, ఈ మారుమూలల్లో, హాతాశులై నశించిపోవలిసిందే కాదూ ?'

'నిరాశ !'

అబ్బాయి ఏమీ మాటాడలేదు.

'నీ జ్వరం ఏమయింది ?' అనిమాత్రం అడిగాడు.

చెలీ ! నా జ్వరం ఇంటికి పోయేటప్పటికి ఎక్కువయింది-నీరసంగావుండి బైటికి ఎందుకు పోయావని మా అయ్య కోప్పడ్డారు.

ఈ సాయంతనం జరిగిందంతా వ్రాయాలి అని కూర్చున్నాను, కిరసనాలుదీపం దగ్గిర.

కాని-ఏం జరిగిందీ ?

'మరణం ముందు-నిరాశ వెనుక' అన్న అబ్బాయి మాటల్లో అర్థంవుందా ?

నిరాశ అంటే ? ఇక ఆ జీవితం వ్యర్థం అన్నమాట !

ఎన్ని జీవితాలు-ఒకటా ? రెండా ? నూరా ? లక్షా ? కోట్లకొలదీ-వ్యర్థం అయిపోతున్నాయి. ఈవ్యర్థానికి కారణం నిరాశ ! నిరాశ ముందు-మరణం వెనుక !

కాని——

భుక్తికోసం దేశాంతరంపోయి మరణించిన భర్త కోసం సంతోషంతో వైనతేయంలో దూకేసిన్న ఆ ముగ్ధ-

ఆకటిచిచ్చుతో అటుమటిస్తూవున్న బిడ్డల్ని తృప్తి పరుపలేక (తన ఇరుగూపొరుగూ మహాభాగ్యంతో తుల తూగుతూవున్న) చెరువులో ముందు బిడ్డల్ని పడేసి-తరువాత తానుపడి-ఈ స్వార్థసంఘానికి వీడ్కోలు చెప్పిన ఆ తల్లి——

ఉరికంబంమీాద చలువ కన్నీరునించి, జయిస్తానని గర్వపడ్డ ఆ యువకవీరుడు——

చీకటి చెరసాలలో చిరునవ్వు నవ్విన ఆ ప్రవక్త-

త్రేతాయుగంలో——విద్వేషాన్నీ స్వార్థాన్నీ నిర్మూలించి——సౌఖ్యాన్ని మానవకోటికి సమానంగా పంచిపెట్టాలని యత్నించి —— స్వార్థపరులచేతిలో హత్యపొంది —— కలియుగంలో తన ఆశయాన్ని గెలిపించుకొంటూవున్న ఆ అమృతజీవి——

'మరణం ముందు——తరువాత నిరాశ' అనేదికూడా కాక——అసలు నిరాశ అనేది లేనేలేదేమో అని...

అబ్బాయి మాటలు కాదన్నాను. సమర్థించుకోవడానికి కూడా ఆయన ప్రయత్నించలేదు!

గంభీరత!!

ఈలాగే అనుకొంటున్నాను, వూహాలు పరుగుత్తుతున్నాయి—కాని కలం జరగడంలేదు.

కలంపడేసి—వూహిస్తున్నాను. ఏదో చిమరవాసన కొట్టింది—

అయ్యో! దీపంబుడ్డిమీదికి వ్రాలి నా క్రాఫింగు వెంట్రుకలు సగం మాడినై.

"ఏమిటి ఆ వాసన?" అని పల్కరించాడు మా అయ్య.

"ఏమీలేదు కాగితం మాడింది" అన్నాను.

"ఇంకా వ్రాస్తున్నావా? పడుకో" అన్నాడు.

దీపం ఆరిపేసి పడుకొన్నాను. కాని నిద్రమాత్రం రావడం మానేసింది. క్రింద చెమ్మ, వర్షకాలంలో మా ఇల్లు అంతా నానిపోవడంవల్ల ఆ చెమ్మ ఇంకా ఆరలేదు. నేను పడుకోవడం వొక చాపమీద. దోమలు విస్తారం.

పైని దోమలూ—లోపల ఆ వేదనలూ—చురుకు చురుకు పొడుస్తున్నాయి.

శరీరంమీదికి చీమలు ప్రాకుతున్నాయి. పైని ఇంటి కప్పు చిల్లులనుండి నక్షత్రాల కాంతులూ—మంచు చినుకులూ రాలుతున్నై.

లేచి కూర్చున్నాను – మళ్ళీ పండుకొన్నాను – మళ్ళీ లేచాను.

దీపం వెలిగించాలని అగ్గిపెట్టెకోసరం వెతికాను.

'ఏమిటి నాయనా అది?' అన్నది మాయమ్మ.

'అగ్గిపెట్టె' అన్నాను.

"అగ్గిపెట్టెలేదు. అగ్గి ఇస్తాను' అంటూ కుంపటిలో నిప్పులు వూదడానికి లేస్తోంది.

'అక్కర్లేదులే అమ్మా' అని చెప్పి పండుకొన్నాను.

మిత్రమా! అగ్గిపెట్టె కొనడానికికూడా డబ్బులేదు. ఆమాట మరిచిపోయే నేను అగ్గిపెట్టెకోసరం వెతికాను!

అయినా మావూళ్ళో-మా (కూలీ) సంఘంలో మేమే భాగ్యవంతులం!

సఖా! రాత్రి అంతా ఇలా గడిచిపోయింది. నాకు లాగే ఎన్ని ఎన్ని ఆర్తిజీవనాలు తపించిపోతూ వున్నావో ఈ నిశీధ సమయాన్ని!

ప్రశాంతంగా నిద్రపోవలసిన రాత్రుళ్ళు మాకు వ్యధా చింతలు-అప్పుడే మాకు తీరుబడి మా బ్రతుకుల్ని గురించి ఆలోచించుకోడానికి.

ఎన్నటికి యీ దుస్థితి తొలగిపోయి సమతాసౌఖ్యం రావడం? ఈ దుర్భర క్షుధానిశీధి గడిచిపోయి ప్రశాంత ప్రభాతం రావడం?

★

ప్రియసఖా !

క్రిష్టమసు వచ్చింది—పోయింది. సంక్రాంతి వస్తూ వుంది-అదీ అలాగే పోతుంది.

కాని,

మాకష్టాలు ఎప్పుడూ రావడమే—పోవడం మాత్రం వుండదు.

ప్రొద్దుటే లేచి అరక కట్టాను. ఊరి వెలుపల వుంత దగ్గర తోట అది. ఆ వుంతలో కూలీల ఇండ్లు చిక్కి-రిబొక్కి-రిగా కట్టబడి వున్నాయి.

నేను దున్నుతున్న తోటదరిని—కంచె ఆవల—ఒక కొంపవుంది. ఆ కంచె ఎత్తుగా పెరిగి, చీకటిచీకటిగా, ముసుగ్గా వుంది.

ఆ కొంపలో ఇంకా దీపము వెలుగుతూనేవుంది. ఆ దీపం వెలుగులో ఒక ముసలివాడు ఏవో కొన్ని కాగితాలు తిరగవేస్తూ కూర్చున్నాడు.

అతడెవరో నాకు తెలుసు.

ఇంకా చీకటిపోలేదు. నేను దున్నుతునే వున్నాను. మంచు కురుస్తూనేవుంది.

ఒక కొండ్రకలిపి, రెండో కొండ్రపోసి, చుట్టూ తిరుగుతూ ఆ కంచెదగ్గరకు వచ్చేటప్పటికి 'జల్లు' మని పూల వర్షం కురిసింది మీాద—

అక్కడ పూలచెట్లే లేవు. డొంకమల్లెలు వున్నా అవి పూసేకాలం కాదిది.

మరి-ఆకాశాన్నుంచి నక్షత్రాలు రాలాయా? దేవతలు పూలవర్షం కురిపించారా నేను పడేకష్టానికి మెచ్చి?

ఏమో-అనుకొని-అరక నొక్కిపట్టి వెనక్కి చూశాను.

'నాయనగారూ! ఇంత చీకటిలోనే అరకకట్టారా?' అన్నది కంచె ఆవలనుండి ఒక వృద్ధకంఠం.

'అవును' అన్నాను.

'మీద పడ్డాయేమో కాగితంముక్కలు, ఏమీ అనుకోకండి.'

'ఫర్వాలేదులే' అంటూ ఎడ్లనితోలాను. నాగలిలో చిక్కింది ఒకపెద్ద కాగితంముక్క.

దాన్నితీసి చదివాను. అందులో ఇలావుంది.

'నాయనలారా! దురన్యాయం-దురన్యాయం సాగుతోంది ప్రపంచంలో. కడుపుమాడి కూలీలు చచ్చిపోతున్నారు. తిన్నది అరక్క ధనవంతులు తట్టుమొట్టాడుతున్నారు. భార్య, భర్త, తల్లి, తండ్రీ, కొడుకూ, ఇంటిల్లపదీ, రెక్కలు ముక్కలు గొట్టుకున్నప్పటికీ కడుపునిండా కూడు దొరకడంలేదు. అయ్యలారా! ఇది గమనించండి, ఇలా ఎంతకాలం ఈ అన్యాయాన్ని జరగనిస్తారు? ... ...'

ఈ ముక్కలో అంతేవుంది. దాని తరువాత ముక్కకోసం వెతికాను అరక ఆపి.

నేను ఆముక్క చదవడం-అరక ఆపి తక్కిన ముక్కలు వెదకడం-ఆ కంచె అవతలి వ్యక్తి చూచాడు.

'ఏంటి అయ్యగారూ! వెతుకుతున్నారు?'

'ఈ కాగితాల్ని ఇలా ఎందుకు చింపివేశావు ?'

'ఎందుకండీ చాలాకాలం క్రిందటివి-ప్రాతవి.'

'ఇలాంటి కాగితాలు ఇంకా వున్నాయా నీ దగ్గిర ?'

'ఏవో నాలుగైదు కాగితాలు మాత్రం వున్నా యండి.'

'వాటిని నన్ను చూడనిస్తావా ?'

'మీ చిత్తం.'

సఖా ! ఇక్కడ నేను చేస్తూన్న పనికి నీవు నవ్వుతా వేమో-నవ్వినాసరే.

అరక ఆపేశాను. ఎడ్లనివిప్పి ఇంటిముఖం పట్టించాను.

తోటలో చెల్లా చెదురుగా పడివున్న కాగితం ముక్కలు దొరికినన్ని పట్టుకొని కంచెలోనుంచి దూరి అవ తలి కొంపకు పోయాను.

ఆ వృద్ధుడు (పేరు సుబ్బారాయుడు) నన్ను సావి ట్లోకి పిల్చి పీటవేశాడు. కూర్చున్నాను.

ఒకమూల ఎలుకలుకొట్టిన పాత తాటాకుల బుట్ట పెట్టెని ఒకదాన్ని నాముందుపెట్టి దానిమూత తీశాడు.

అందులో కొన్ని కాగితాలు వున్నమాట వాస్తవమే. కాని తెల్లకాగితాలు ! ఒకటిరెండు ఏవో చిల్లరపద్దుల జాబి తాలు-ఒకటి రెండు వుత్తరాలు.

'సరిలే, మంచి కాగితాలు చింపేశావు' అంటూ అక్కడే కూర్చుని ఆ చింపుముక్కలు చదవడం మొదలు పెట్టాను ఒక్కొక్కటి.

'అమ్మలారా! అయ్యలారా! తక్కువకూలీకి పని చెయ్యకండి. కామందు అనగా......'

ఒక ముక్కకూ మరో ముక్కకూ అతుకులు కుదర లేదు. అందుచేత ముక్కలన్నీ వట్టివట్టినే చదివేశాను.

'...మన కష్టర క్తం, మన వేడిచెమ్మట, ధనవంతులకు తిండి అవుతున్న...'

'గొప్పవాళ్ళం అనుకొనేవాళ్ళు మనతో సమానంగా అయినా పనిచేయాలి-లేక వాళ్ళతో సమానంగా బ్రతక డానికి సరిపోయేటంతకూలి అయినా...'

'వూళుపుల్లో కట్టుకట్టించాను. కూలి రెట్టింపు చేయిం చాను'

'...వేళ, వందమంది చుట్టలు త్రాగేవాళ్ళని కొట్టాను. నలభై మంది త్రాగుబోతులకి సంఘశిక్ష వేయిం చాను. మరీ...'

'శనివారం సంతకు వెళ్లాను. సంతచుట్టూపాతిన తుమ్మ ముళ్ళకంపలకు వేనవేలు పొగచుట్టలు గ్రుచ్చ...'

'కట్టుకు లొంగకుండా పనిచేయడానికి కూలీల్ని తీసు కొచ్చిన వెం...'

మిత్రమా! ఈ విధంగావుంది ఆ కాగితం ముక్కల్లో-

ఇది లెనిన్ హెచ్చరింపా? మ్యాజినీ దినక్రమమా? - ఏమీకాదు—

ఒక గ్రామీణుని తెగింపుమాత్రం.

ఇతడు ఏమి చదువుకొన్నాడు?

నిరక్షరకుక్షి! ఏమేమి విప్లవగ్రంథాలు తిరగవేశాడు!

అసమత్వం—సంఘదౌష్ట్యం—అనుభవం !

'ఈ వ్రాతలన్నీ ఎవరు వ్రాసిపెట్టారు నీకు ?' అన్నాను.

'ఎవరైనా అబ్బాయిచేత చెప్పి వ్రాయించుకొనే వాణ్ణి' అన్నాడు.

'మరి వీటిని ఎందుకు చింపివేశావు ?' అన్నా.

'నాయనగారూ ! ఎందుకండీ ఇవన్నీ ? నాకేమి చేస్తాయి ? పనియేమన్నా అయిందా—కష్టం ఏమైనా ఫలించిందా—ఏమీ లేదు. పనికావాలి గాని మనకు వట్టివ్రాతలు కూడుపెడతాయటండీ ?' అన్నాడు సుబ్బారాయుడు.

అంటూ,

'ఎంత శ్రమపడ్డాను ? ఎంత కష్టం అనుభవించాను ? ఎందరి తిట్టులు తిన్నాను ? ఎందరి క్రోధానికి బలిఅయాను ? ఎన్నిసమ్మెలు కట్టించాను? ఎందరిని–కామందుల్నీ, కూలీల్నీ కూడ—కొట్టాను ? ఎన్నిసార్లో కోర్టులకి వెళ్ళాను? ఎన్ని సార్లు నెగ్గుకవచ్చాను.

'అయ్యగారూ ! నాకష్టం వ్యర్థమైంది. నా బ్రతుకే విఫలం అయింది. ఇంక నన్ను యీ కాగితాలా రక్షించేవి ?

'ఆ రోజులు తలుచుకొంటే, అప్పుడు మీరింకా చిన్నవారు, నేను ఇంకా ఎందుకు బ్రతికివున్నానా అనిపిస్తుంది. ఎంతో విచారం కలుగుతూ వుంటుంది.

'సంఘం ఒక అధర్మసంస్థ. ధనవంతులు స్వార్థం కోసమూ-పేదలు పరార్థంకోసమూ-జీవితాల్ని త్యాగం చేసుకొంటున్నారు. ఎంత దారుణం!

'కూలిని ఎక్కువ చేయడానికి సమ్మెకట్టేటప్పుడు ఒకనాడు నేను క్రరపుచ్చుకొని త్రోవలో నిల్చుంటే జిల్లా అంతా వొణికింది.

'ఆ రోజుల్లోనే నా యత్నాలు ఫలించలేదు. మన వాళ్ళకి అంతరాత్మలు లేవు. వివేకం శూన్యం, ఓర్వజాలని తనం మెండు.

'ఏమో—' అంటూ పెదవి విరిచాడు నీరాశతోటి ఆ ముదుసలి!

సుబ్బారాయుడి ఉపన్యాసం వింటూ అలాగే కూర్చుండి పోయాను.

కూటికోసం కూలీలు పోరాటం సలిపిన ఆ రోజులు సమ్మెలతోటీ-దొమ్మీలతోటీ-కుట్రలతోటీ-క్రోధాలతోటీ-అల్లకల్లోలంగా కనుపించాయి నా ఊహానేత్రానికి.

సంఘం ఒక అధర్మసంస్థ?

ఔను-ఔను-

ముమ్మాటికి ఔను.

ఈ అధర్మానికి ఈ గ్రామీణుని హృదయం ఎంత కుమిలిపోయిందో!

'గొప్పతనాన్ని గ్రహించి, గౌరవించే ఉపజ్ఞ భారతీయులకు లేదు. ఇటువంటివాళ్ళు ఏ పరదేశంలోనో అయితే

యుగపురుషులు అయివుండేవాళ్ళు-ప్రపంచానికి సౌభాగ్యం కూర్చి వుండేవాళ్ళు'

'చైనా విప్లవనాయకుడైన సన్‌యాట్‌సేనుడి వీలు నామా లోకప్రసిద్ధం. అది ఈ సుబ్బారాయుడి దినచర్యను మించగలుగుతుందా ?

'ఎందరెందరు మహాపురుషులు ఇలా వ్యర్థం అయి పోతున్నారు !

'అవిద్య ! అవిద్య ! అవిద్య ! దీనికంతకీ, ఈ దుస్థితి కంతకీ, మూలకారణం అవిద్య !

'అవిద్య అనాగరికలక్షణం. అనాగరిక దేశాల్లో భారత దేశం మొదటిది !'

సఖా ! ఇలాంటి వూహాలు రెచ్చిపోయినై. నాకు గుండె బరువెక్కి పోయింది, కూర్చున్నకాడనుంచి లేవలేక పోయాను.

వూహించే కొలదీ క్రొత్త విచారాలే పుట్టుకొస్తు న్నాయి. కాని ప్రాతవిచారాలు పోవడంలేదు.

'అన్నోయ్, అయ్యారమ్మంటున్నారు' అని పిలిచింది మా చెల్లి.

'వెళ్ళండి అయ్యగారూ ! వెళ్ళండి కాని మన సంఘాన్ని-సంఘంలో అతిదుర్భరస్థితిని అనుభవిస్తూవున్న కూలీల్ని మాత్రం మరిచిపోకండి' అంటూ సుబ్బారాయుడు ఇంట్లోకి పోయాడు.

'అయ్యో ఏమంటున్నారు ?' అన్నాను మా చెల్లెతో ఇంటికి వస్తూ.

'తిడుతున్నారు'

'ఎందుకూ ?'

అంటూ కంచెదాటి చూచేటప్పటికి నేను దున్న కుండా అరక మానివేసినతోట దున్నివుంది.

'అమ్మో' అనుకున్నాను 'ఇంకేముంది ! ఈవేళ సాదింపులు తప్పవు.'

నేను సుబ్బారాయుడి ఇంటికివెళ్ళిన తరవాత మా అయ్య వచ్చి-తిరిగి అరకకట్టి-ఆ తోట దున్ని వేసినాడు.

కావలసినది కార్యం, కబుర్లుకావు. నేను చేసినపని ఏది ? సుబ్బారాయుణ్ణి మెచ్చుకోవడం.

అతని వ్రాతలు చదివి ఆనందించడం.

అతని అభిప్రాయాల్ని పదేపదే ఊహించడం, గొప్ప వాళ్ళని కనుటలో భారతదేశం ఇతర దేశాలకి తీసిపోదు అని గర్వించడం. అంతే.

ఇదంతా ఎందుకు ? కూడు పెడుతుందా ? గుడ్డలు ఇస్తుందా ? సౌఖ్యం చేకూరుస్తుందా ? ఏదీలేదు.

అయినా-అంత తప్పుపని చేశానా ?

చేయవలసినపని చేయలేదు.

కాని-అనామకుడై పోతున్న ఒక గొప్ప ప్రజాసేవకుణ్ణి గురించి కొంత తెలిసింది.

అయినా-

సుబ్బారాయుడు నాకుమల్లే ఊహాజీవికాదు. ఉత్తర కుమారుడూ కాదు. కష్టజీవి-కర్మజీవి.

మిత్రమా! ఇంటికి చేరేటప్పటికి నా వ్యూహాలు మధ్యలోనే వున్నై. హఠాత్తుగా చినిగిపోయినై - మా అయ్యను చూచేటప్పటికి.

కాని ఆ చినుగుల్లో-'సంఘం ఒక అధర్మసంస్థ' అనేది మాత్రం శిథిలం శిథిలంగా రాలింది.

సంఘం మీద ఏవగింపు నల్లగా ఆవరించింది- సంజ చీకటిలాగ.

అందులో ఏవో క్రొత్త వ్యూహాలు తళుక్కుమన్నాయి నక్షత్రాల్లాగ. ఆ నక్షత్రాల్ని గురించి నీకు వచ్చే లేఖలో వ్రాస్తాను.



సుహృద్వరా!

'ప్రతిదీ విచిత్రమే--అన్నీ ఆశ్చర్యాన్నే కలిగిస్తాయి నీకు'- అన్నావు. కోతలు కోసేటప్పుడు ఈనాందార్లు దగ్గిర వుండి కుప్పలు వేయించుకొంటారు.

ఊడుపులు ఊడ్చినప్పటినుంచీ కష్టం ఫలితానికి వస్తుంది, కడుపారతింటాం, అని కాచిపట్టుకొనివున్న రైతులు కూలీలు బిక్కమొగాలు వేసుకొని నిరాశ చేసుకొని ఇండ్లకు పోతారు.

ఇదేమిా కడుపు కోతపెట్టదా! హృదయం (ఉంటే) మండించదా! దీన్నికూడా నీవు తేలికగానే చూస్తావేమో, నీ వింత ప్రకృతి నాకు అర్థంకాలేదు.

నీవు నమ్మవుకాని అన్నంలేక ఎంతమంది చచ్చి పోతున్నారో పల్లెటూళ్ళలో లెక్కలులేవు.

కాయకసరూ, పండూఫలమూ, ఏవో ఎల్లప్పుడూ వుండే పల్లెటూళ్ళలో దరిద్రదేవతకు ఎంతోమంది బలి అయి పోతున్నారంటే, మరి ఆ దేవత భయంకర రూపం నీవే యోచించుకో.

పస్తులుపడి మాడిచస్తున్నారు పాపం ప్రజలు అని పనులు యేమన్నా తక్కువఅవుతవా! ఊహుం- ఎప్పటిపనులు ఎప్పటి మాదిరిగానే వుంటవి.

తమ కూలీలు, రైతులు, పాలేళ్ళు, తిన్నారా—తిన లేదా-అని ఆలోచించరు యజమానులు. తిన్నాసరే తినక పోయినాసరే పనులు మాత్రం ఎప్పటిలాగే చేయాలి. తాము మాత్రం తృప్తిగా భుజించివచ్చి గట్లమీాద కూర్చుంటారు.

ఇదంతా ఎందుకు చెప్పవలసిందంటే మేముకూడ కొంత పొలం కౌలుకు చేస్తున్నాం. పండినచేలు కోసి కుప్ప వేసి ఇంటికివెళ్ళి రాత్రి పస్తుపడుకోవలసి వచ్చింది. ఎంత కష్టంగా వుంటుందో అనుభవించినవాళ్ళకే తెలియాలి.

'పస్తులు పడుతున్నారు పాపం' అని ప్రకృతి కరుణిస్తుందా? అసలు ప్రపంచంలో ఇలాటి హెచ్చుతగ్గులు, కష్ట సౌఖ్యాలు వున్న సంగతి ప్రకృతికి తెలుసా? ప్రపంచం ఒకేరీతిగా వుండాలనే ప్రకృతి ఆశయం. కాని, సంఘం స్వార్థపరుల పక్షం వహించి మావంటివార్ని అధోగతిపాలు చేస్తుంది.

శీతకాలం, మెట్టదుక్కులు, తోటలు ఆరిపోతున్నాయి. 'రేపు అరకలు కట్టాలి' అని చెప్పిపోయాడు మా యీనాం దారు. 'కట్టవచ్చులెండి' అన్నాడు మా అయ్య. కాని–

'ఆరిపోవడంలే ఆ మొరకగడ్డ?' అంటూ కళ్ళెర్ర జేస్తే ఏమిచేస్తాం?

ఇంతమాత్రం దానికే అంతకోపమా అనుకొన్నాను నేను. కాని, మన స్వాతంత్రభావాలు అక్కడ చెల్లుతవా? కామందు హుకుం, చేసితీరాలి.

తొలికోడి కూయక ముందునుంచే లేపడం ప్రారంభించాడు మాయయ్య నన్ను. నాకు నిద్రచాల్లేదు. రాత్రి సగం రాత్రివరకూ పొలంలో కుప్పదగ్గర జాగారం చేశాను. మా వూళ్ళో దొంగలు విస్తారంలే.

దొంగలంటే మామూలు దొంగలుకాదు. మామూలుగా దొంగలు భాగ్యవంతుల్ని దోచుకుంటారు.

భాగ్యవంతుల్ని దోచుకొంటే పదిరోజులపాటు బ్రతుకనన్నా బ్రతుకవచ్చు. కాని పల్లెటూళ్ళలో ఈమధ్య చిల్లర చిల్లర దొంగలు బైలుదేరారు. కొబ్బరికాయలు దొంగిలించడం, కుప్పలు దోచుకోవడం, వాకిట్లలో పెట్టుకొన్న కుండా బిందీ ఎత్తుకుపోవడం. ఇవి చిల్లర దొంగలు చేసే గొప్ప దొంగతనాలు.

పేదలు, పేదల కొంపలే దోస్తారు. తిండిలేనప్పుడు కడుపు కాలుతూవున్నప్పుడు, ప్రాణాలు అటూఇటూ అవుతున్నప్పుడు ఏమిచేయాలి? మూడే మార్గాలు.

అడుక్కోవాలి, అంటే భిక్షమెత్తుకోవాలి. ఎవడు పెడతాడు? ఒకపూట-రెండుపూటలు అయితే ఎవడైనా పెడతాడు ముష్టిలో పిరముష్టి. అక్కడనుండి?

అప్పుచేయాలి? ఎక్కడ? ఎవరిదగ్గర? పేదలకు అప్పులు ఎవరు యిస్తారు? అప్పులుచేసి తిరిగి ఎలా తీర్చుకొంటారు? పోనీ అప్పులుచేసి ఎగవేయడానికైనా అక్కడనుండి?

దొంగిలించాలి. ఈ కళ అందరికీ చేతకాదు. కాని కొందరు జీవితంలో నిరాశపొంది సంఘం చేస్తూవున్న అన్యాయాన్ని సహించలేక, తాము బ్రతకడానికి వేరుగతి గానక దొంగతనానికి దిగుతారు.

ఎన్నిచట్టాలు చేసినా, ఎన్ని బందోబస్తులు చేసినా- ఎన్ని రక్షణవిధానాలు అమల్లోపెట్టినా, దొంగతనాలు ఆగకపోవడానికీ 'క్రైమ్' అనేది తగ్గక పోవడానికీ—కారణం ఏది అంటావు? సంఘంలోవున్న అసమత్వమే. ఈ 'క్రైమ్'ను ఆపడానికి సంఘాన్ని ఆమూలాగ్రంగా సంస్కరించాలి. అట్లు

సంస్కరించక ఎన్ని క్రొత్త చట్టాలుచేసినా, ఎన్ని క్రొత్త బంధిఖానాలను కట్టించినా ఏమీ లాభం వుండదు.

దొంగలు ఎవరు? సంఘ దౌర్జన్యాన్ని ఎదుర్కొనే విప్లవకారులు. న్యాయానికి సంఘంలో స్థానంలేదని గ్రహించి అసమత్వాన్ని బహిరంగంగా ఎదిరించడానికి జంకి, వేరు మార్గాలుపట్టిన సంఘీయులు.

దొంగలుకూడ మనుష్యులే. వాళ్ళూ అందరిలాగ పుట్టినవాళ్ళే. వాళ్ళకీ అంతరాత్మలు వున్నవి.

కాని మా పల్లెటూరి దొంగలు కేవలం తిండికోసం-ఆకలికూ, చేడకూ దొంగతనాలు చేస్తారు. పేదల్ని పేదలే దోచుకోవడం.

దొంగతనాలు తప్పుకాదు అని నేను అనడంలేదు. కాని, నిరుపేదలకూ, నిరుద్యోగులకూ బ్రతకడానికి గత్యంతరాన్ని సంఘం చూపడంలేదు.

అలాంటి దొంగలు! మాకుప్ప యెక్కడ నూర్చుక పోతారో అని రాత్రులంతా కాపలా మూలాన్ని నిద్రచాలడంలేదు.

'పొద్దుపొడుచుకొచ్చేస్తుంది. లెగులెగు ఇంత నిద్దరా?' అన్నాడు మాఅయ్య. లేవక తప్పిందికాదు. చలి వణికిస్తుంది. నీవు నిగుడు కొనిపెట్టిన ఖద్దరు దుప్పటి కప్పుకొని బైటకు వచ్చాను. రావడంతోటే 'జుంయ్' మని నడినెత్తినుంచి పాదాలదాకా మంచుగడ్డ చేసేసింది శరీరాన్ని. ఒక మంచు బిందువు మామిడిఆకు మీదనుంచి రాలింది 'అమ్మా' అనుకొన్నాను.

'రండి రండి' అన్నాడు వెంకన్న 'ఎడ్లుముందు వెళుతున్నాయి. నాగలికూడా తోటలోవేసి వచ్చాను.'

మిత్రమా! అతణ్ణిచూచి ముందు నేను భయపడ్డాను. ఒక గోచితప్ప అతని పైమీద మరి బట్టలేమీ లేవు. చేతిలో ఒక చిన్న ఈతజువ్వ, కిర్రుచెప్పులుకూడ వున్నాయి. ఒక మ్రోడులాగ నిల్చున్నాడు మావాకిట్లో!

ఎంతకష్టం! పట్నంలో సౌఖ్యంపొందే సుకుమారులకు—పల్లెటూళ్ళలో అయినా ధనం కూడబెట్టుకొని సర్వ భోగాలూ అనుభవించే జమీందారులకు, ఆ చలి ఆపడానికి ఎన్నిశాలువులు కావాలంటావు? పైగా భారతదేశపు శాలువలు చాలుతవా? విదేశాలనుంచి దిగుమతికావాలి బేళ్ళు, బేళ్ళు.

అలాంటి భయంకరం అయిన చలి వెంకన్నను ఏమీ చేయలేదు.

'నీకు చలిపెట్టడంలేదూ?' అన్నాను.

'కప్పుకోడానికి దుప్పట్లువున్న మీవంటివారికి తప్ప నాకేమి చలి?' అన్నాడు అతడు, అంతటితోటి వూరుకోక ఒక మోటుసామెతకూడా ప్రయోగించాడు చలిమీద.

'నన్ను కూడా దొంగల్లో చేర్చావా' అన్నాను దుప్పటిన్ని తీసివేస్తూ.

'అదేమిటండీ! మీరు దొంగలెలా అవుతారు?' అన్నాడు.

'ఇపుడు నీవు అన్నావు కావూ దొంగనని? అనడమేమిటి? నిజంగా నేను దొంగనే. నీకులేని దుప్పటి నాకు

ఎలా వచ్చింది? నీవూ కష్టపడుతున్నావు. నేనూ కష్టపడుతున్నాను. ఇద్దరి కష్టమూ సమానమే. అయితే నాకువున్న దుప్పటి నీకు ఏది?' అన్నాను.

'మీరు కొనుక్కున్నారు; నేను కొనుక్కోలేదు' అన్నా డతడు.

'నీవు ఎందుకు కొనుక్కోలేదు?'

'నాకుయిచ్చేకూలి ఒక్కపూట తిండికే సరిపోతుంది. రెండోపూట పస్తే. ఇక బట్టలు ఏమిపెట్టి కొనుక్కుంటాను?'

'నాకూ అంతేకదూ? మరి నే నెలా కొనుక్కున్నాను?'

'ఏమో' అన్నా డతడు. అప్పుడు నే నిలా చెప్పాను.

'నేను కొనుక్కోలేదు యీదుప్పటి. భాగ్యవంతుడైన ఒక స్నేహితుడు కొనిపెట్టాడు. ఆ స్నేహితుడికి మాత్రం డబ్బు ఎక్కడిది?'

'ప్రపంచంలో బ్రతకడానికి మూడే మూడువిధాలు: (౧) కష్టపడి సంపాయించుకోవడం, (౨) భిక్షమెత్తుకోవడం, (3) దొంగిలించడం.

'ధనికులు పనినా చేయరు, ధనికులు భిక్షింప, రింక ధన మెట్లబ్బున్?'

'అని ఒక కవి ప్రశ్నించినట్లే ప్రశ్నించుకొంటే, మన వంటి పల్లెటూరి పేదరైతుల, పేదకూలీల నోర్లుగొట్టి కూడబెట్టిన ధనమే ధనికులకు ఆధారమని తేలుతుంది. అట్టి ధనాన్నిపెట్టే నా మిత్రుడు ఈ దుప్పటిని కొనిపెట్టాడు. అతని

మిత్రుణ్ణిగనుక నేనూ దొంగనే. నీవు సరీగా అన్నావు. అందు కనే దీన్ని తీసిపారేశాను.'

నా యీ ఉపన్యాసానికి నివు కోపగించుకో నక్కర్లేదు.

నేడు కూపస్థ మండూకాలకి కూడా రాజకీయాలు తెలుసు. ఇలాంటి ఉపన్యాసాలు పల్లెటూళ్ళలో ప్రతీ పశువులకాపరి కుర్రవాడికీ వచ్చు.

కాని,

'దిగుదిగుమనే నా సవితేకాని, దిగే నా సవితి ఒకర్తా లేదు' అన్నట్లు అందరూ చెప్పేవాళ్లే. చేసేవాళ్ళే కళ్ళకు కనుపించరు.

'ధరణిలో, దొంగతనములో, దొరతనములో' అని పాడాడు వెంకన్న. మా వూరికి యెనిమిదిమైళ్ళ దూరంలో వున్న ఒక వూళ్ళో వేసిన హరిశ్చంద్ర నాటకానికి కామందుతోకూడా వెళ్ళి అతడు నేర్చుకొన్నవి ఈ రెండుముక్కలే.

అయినా సమయానికి స్ఫురించే విద్య కొంచమయితే నేమి?

'దొంగతనాలకైనా దొరలకే చెల్లింది - దొరతనాలకైనా దొరలకే చెల్లింద. మీ కేముండీ? మధ్య మావంటివాళ్ళున్నారుకదా మాడి చావడానికి?' అన్నాడు పుసుక్కున.

అరే! నేను ఒకరిమీద నిందమోపుతుంటే, ఇతడు నామీద నింద మోపుతున్నాడు!

సఖా ! 'ఇదే సాంఘికాంతరములో వున్న నిగూఢ రహస్యం !' అనుకొన్నాను.

'మాటలకేంగాని ప్రొద్దుపొడిచేస్తుంది, రండి' అన్నాడు వెంకన్న.

దుప్పటి తీసిపారేసి నేనూ కర్రతీసికొని బైలుదేరాను. కాని— చలి !

ఊరికే నాకు నేనే – వణకిపోవడం మొదలుపెట్టాను. మాట్లాడబోతే 'వ వ వ వ వ' 'ద ద ద ద ద' అంటూ ప్రారంభమైంది.

పచ్చికతోనిండి, నేలంతా చల్లని మంచునీటి మయు మయింది.

చెట్లఆకులమీదనుంచి మంచుబొట్లు రాల్తూ ఒక్కొక్కటి ఒక్క చలిపిడుగులాగ మొత్తుతున్నాయి.

'చదువుకొన్నవారు, మీకుకూడా యీ తిప్పలన్నీ ఎందుకండీ ?' అన్నాడు వెంకన్న నా అవస్థ చూచి.

'పేదలు చదువుకొన్నా సరే – చదువుకోకపోయినా సరే. పట్నాల్లోవున్నా సరే– పల్లెల్లోవున్నా సరే అవస్తలు తప్పవు–' అన్నాను, మరేమీ అనడానికి తోచక.

'లేదండీ, చాలమంది పట్నాల్లో ఉద్యోగాలు చేసుకొంటున్నారుగా ! మా నీలకంఠబాబుగారికి మా ఆలాపనే లేదు' అన్నాడు.

'నన్ను కూడా మీ నీలకంఠ బాబుగారిలాగ అయి పొమ్మంటావా ?' అన్నాను.

ఈ మా ఘాసుల సందట్లో నా చలి సగం చచ్చింది.

'వెంకన్నా! నీవే చెప్పు భాగ్యవంతులు ఉద్యోగస్థుల్లో వుంటారంటావా, లేక వ్యవసాయం వర్తకం చేసుకొనేవారిలో వుంటారంటావా, ఎక్కువమంది?' అన్నాను, అరకలుకట్టే తోటలోకి వెళుతూ.

'వ్యవసాయం, వర్తకం చేసుకొనేవారిలోనే వుంటారు' అన్నాడు ఎడ్లభుజాలమీద కాడిపెడుతూ.

'అయితే, ఈ ఉద్యోగస్థులు పట్నాల్లోవుండి ఎవరికి మేలు చేసినట్టు? వాళ్ళ జీతండబ్బులు వాళ్ళకే చాలవే. వారంతా పల్లెటూళ్లు వచ్చేస్తే దేశాన్ని ఎంత శోభావంతం చేయగలరో ఆలోచించు' అన్నాను నేనుకూడా ఎద్దులభుజాల మీద కాడిపెడుతూ.

వయ్యారంగా (పట్నంలో మసిలినవాణ్ణికదూ!) కాడి పెట్టబోయానేమో అందులో ఒక ఎద్దు కొమ్ము విసిరింది. కాడి క్రిందబడింది, నా మోకాలు బొప్పికట్టింది.

కొమ్ము విసిరిన ఎద్దును కొట్టాలా, కాలికి తగిలిన నాగలిని కొట్టాలా, అన్నంత కోపంవచ్చింది. సఖా! ఇదీ నేటి నా యువఃకాల జీవితసరళి! నా మెట్టదుక్కుల అనుభవాలూ, కుప్పనూర్పుల అనుభవాలూ నీకు చాలా లేఖలు వ్రాయించేలాగున్నాయి.

ఇలాగే రాస్తూ వుంటానులే. కష్టపడి అలసిన నా హృదయానికి కొంచెం ప్రశాంతి, కలుగుతూవుంటే చాలు. నా లేఖలన్నీ నీవు సాంతంగా చదువుతూవుంటే చాలు.

మోకాలి బొప్పి సలుపుతోంది. ఆవుపేడ కాపడం పెట్టుకోవాలి. ఇక నేను విరమిస్తాను. ★

ప్రియ సుహృదీ!

ఆ రాత్రి తిరుపతిరావుకూడా పొలంపోయాను.

ఆపొలం ప్రక్కనే వైనతేయం ప్రవహిస్తోంది ప్రశాన్యంగా.

కొబ్బరాకు చిగుళ్ళతో వేసిన వొక పైరుపాకలో వొక కిరోసినాయిల బుడ్డిలాంతరు మినుకు మినుకు మంటూ వుంది దూరంలో.

పోతూ-పోతూ పురుషోత్తంసమాధిదగ్గర నిల్చున్నాం కొంతసేపు.

ఆనాటి రోజులన్నీ - ఆ యువజనోద్యమాలూ, ఆ గ్రామ ప్రచారాలూ, గుప్పున వచ్చాయి జ్ఞాపకానికి.

వేసవికాలంలో తలలుకాల్చుకుంటూ కాళ్ళుమాడ్చు కుంటూ ఆ యిసుకగరువు పల్లెలన్నీ తిరిగి యువకుల్లో జాతీయజీవనం పోసిన ఆ బాల్యదినాలు కన్నులకు గట్టినై.

జాతిదాస్య ముక్తికీ, దేశ సౌభాగ్యానికీ విధానాలు ఏర్పరుస్తూ ఆకాశానికి నిచ్చెన్లు వేసిన ఆ చిన్నతనపు టూహాలు - ఆ వ్యూహాల్లో పొంగెత్తిన ఆ ఉడుకు - అవన్నీ ఆపాదమస్తకం తిమ్మిరిపుట్టించినై జీవనాడుల్లో.

బాల్యావస్థ ఎంత పవిత్రవంతం! అది ఎంతైనా చేయ గలదు - మానవాభ్యుదయానికి.

'చేతనముల్ వసంత వనసీమలలోపల
పల్లవించి, విస్పృత వినూత్నలీల
సురభింపగనుండిన నాటి వేళలన్;
మేతలు మేసికొన్నవి సుమీ, యెడదల్
కడసారి! నేటికిన్ ఆ తియ్య త్రేన్పులే
వెడల నైనవి వస్తులగూడ! నెచ్చెలీ!'

అని పాడాడు తిరుపతిరావు - అపూర్వంఅయిన ఏదో వొక అనుభవాన్ని కలిగిస్తూ, ఆ అంధకారంలో అక్కే నిల్చు న్నాం మౌనంగా.

అంతా నిశ్శబ్దం - ఆ నిశ్శబ్దంలో వొక వృద్ధకంఠం- ఆ కంఠంలోంచి వొక జానపదగీతి బహుళంగా వినిపించింది మాకు.

'మా తాత' అన్నాడు తిరుపతిరావు, 'భారతాది గ్రంథాలు చదివినవాడు, వ్యావసాయిక గీతాలు మంచి మంచివి పాడతాడు.'

ఆ వొడ్డే బడిపాకదగ్గరకు వచ్చాం - వచ్చి వెనకాల నిల్చున్నాం - పాట- ఏమో - హృదయాన్ని ఆకర్షించింది నాకు.

'కష్టానికొక ఫలము
కన్నీటికొక వాంఛ
వాంఛలో సౌఖ్యాను
భవమె లేకున్నచో
కష్టమేలోయీ ?
కంట నీరేలోయి ?
నా బీదకూలీ !
నా బాలకూలీ !'

గీతం సన్నబడి - ఆవులించాడు ఆ వృద్ధుడు.

'నీ చెమటబొట్టులానే కాదరైతా ?
నిఖిలసంపద లీనినానోయి ! రైతా !
ఏలనీ నా భాగ్యమంత గొంపోయి
ఎక్కడో, ఎవరికో, అప్పగించేవు ?

వ్యర్థమే కాదా? నీ కష్టనష్టాల
కర్థమే లేదా?
మోసగించావా? విను నమ్ముకొన్నట్టి
ముద్దరాలను నన్ను??

అంతలో తిరుపతిరావు అమాంతంగా తుమ్మాడు. పాట ఆగింది, పలుకరించాడు.

'ఎవరు, తాతగారు! ఆ ముద్దరాలు?' అన్నాను.

'ఏదో, బాబూ! పాట' అన్నాడు, 'మీా రెంత సేపయి వచ్చారిక్కడికి!'

'అబ్బే, ఇప్పుడే.'

'అయితే ప్రక్కలు వేసుకొని పడుకోండి.'

తిరుపతిరావు ప్రక్క సర్దుతున్నాడు.

'పడుకోవడాని కేంలెండి - ఏదైనా పాట పాడండి' అన్నాను.

'ఎంతకాలం-ఎంతకాలం అన్నా పాటపాడు, తాతా! అది బాగుంటాది' అన్నాడు తిరుపతిరావు.

'పాటల కేంలే, బాబూ! పాటలు ఎన్నయినా పాడుకో వచ్చు వృద్ధుణ్ణి - ఓపిక లేదు' అన్నాడు.

'మాకుమాత్రం అంత వోపిక వెలిగిందా? పోనీ-ఒక కథఅయినా చెప్పండి.'

సాగించాడు ఆ ముసలాతడు కథ:—

ఇందాక ఆ ముద్దరాలు ఎవరు అని అడిగావు కాదూ?

ఒకనాడు - ఒక పైరుచేలో గడ్డికోస్తూ ఒక కూలీ బాలిక ఇలా అనుకొంటూవుంది:

'గడ్డీ! గడ్డీ! ఎవరవు నీవు?'

'భూదేవి బిడ్డను.'

'ఇప్పుడు ఏంచేస్తున్నావు?'

'కఠినుల చేతుల్లో - చావూ బ్రతుకూ మధ్య అల్లాడు తున్నాను.'

'గడ్డీ! గడ్డీ! ఇపుడెక్కడికి వెడతావు నీవు?'

'శామందు పశువుల కొట్టంలోకి.'

'అక్కడ నీకు ఏంపని?'

'పశువులపేగుల్లో అరిగిపోయి - పాలుఅవడం'

'గడ్డీ! గడ్డీ! అపుడు నీవు ఎందుకు పనికివస్తావు?'

'శామందులు బాగా పెరగడానికి పనికివస్తాను'

'వారు నీకేమిస్తారు?'

'మడిమతాపులూ— కొడవలికోతలూ—ఇస్తారు.'

'అయితే నీవూ—నేనూ— వొకటే.'

ఇలా ఆ బాలిక అనుకొంటూవుండగా ఆ గట్టెపోతూ వొక రైతు ఆ మాటల్ని విన్నాడు.

'మీరే ఆ మాటలువింటే ఏమనుకొంటారో చెప్పండి' అని ప్రశ్నించాడు మమ్మల్ని ఆ వృద్ధుడు.

'అవేవో పిచ్చిమాటలో— ఆగతాయికబుర్లో అను కుంటాం' అన్నాను.

'ఆ రైతు అలా అనుకోలేదు— మీకంటే తెలివైన వాడు' అన్నాడు. మళ్ళీ కథసాగింది:—

ఆ మాటల్ని విని ఆలోచించాడు అతను. ఆ పంట పొలం అంతా వొకసారి చూశాడు. అది పుష్కలంగా... కలకల్లాడుతునే కనిపించింది.

తనకేసి చూచుకొన్నాడు. ఆ గడ్డికోసే బాలికకేసి చూచాడు. తాము ఇద్దరూకూడా కళావిహీనులైన అస్థిపంజరాల్లాగే వున్నారు.

మళ్ళీమళ్ళీ పంటపొలంవంకా–తమవంకా చూచాడు.

ఒక్కక్షణం కన్నులు మూసుకొన్నాడు.

ఎవరు అతనియెదుట ప్రత్యక్షం అవుత ?

సస్యలక్ష్మి !

నేను ఇందాక పాడినపాట——ఆ లక్ష్మిదే. ఆమెయే ఆ ప్రలాపిస్తూవున్న ముద్దరాలు.

రైతు సాష్టాంగపడ్డాడు——కన్నులువిప్పి చూచాడు. ఏముంది ? అంతా మామూలే!——

పొలాలు పంటలతో నిండీవున్నై——అతనికడుపు ఆకటితో మండుతూనూవుంది.

'అంతే కథ–నిద్ర వస్తూంది. పడుకోండి' అన్నాడా ముదుసలి.

'సగంలోనే ఆపేసి అంతే కథ ఏంటి ?' అన్నాను.

'నిద్ర మనకు వుండకూడదు. అది మనకు కాదు. ఈ పొలాల్లో ప్రవహిస్తూ——ఈ ఉప్పునీటి కాలువల్లో కలిసిపోతూవున్న మన జానపద హృదయ సౌందర్యం ప్రపంచ

దృష్టిని ఆకర్షించి, తనలో లయం చేసికొనేవరకూ మనం నిద్రపోకూడదు'

అని చెపుతూ—

'కునుకొక్క మునుకయో
మునిగిపోవలదయో
నీవు కునికే ముందు
నీయుల్లమును విప్పి
శాంతి సందేశమ్ము
సౌఖ్యమ్ము ప్రజకిచ్చి
మునిగిపోవోయీ
మనికి సార్ధకమోయి
కునుకకోయీ, సఖా!
కువలయమ్మీక్షింపు,
లేచిరావోయీ
లేతపూదోటోయి,
విహరింపుమోయీ
అహములన్ నిశలున్,
కునుకకోయీ సఖా,
కువలయ మ్మీక్షింపు'

అంటూ పాట మొదలుపెట్టాడు తిరుపతిరావు. ఆ పాటలో ఆ వృద్ధుడు నిజంగానే మునిగిపోయాడు.

ఆ ముడుతలు పడ్డ నేత్రాల్లో ముత్యాలసరులు కాన్పించాయి. అతని విలువ రోజుకు రెండణాలు మాత్రం. కాని— ఆ ముత్యాల విలువ? క్షణానికి సామ్రాజ్యాలు!

ఒక్కక్షణం రెండుక్షణాలు.

కన్నులు నులుముకొన్నాడు, నాకళ్ళలోకిచూచాడు.

'నిజమే-బాబూ! నిజమే పాటుపడడం—తినడం-నిద్రపోవడం ఇవే మనపన్లు' అన్నాడు.

'అందుకనే—తాతగారూ! మనం నిద్రకట్టుకొని అయినా ఏదో పనికివచ్చే పనిచేస్తూవుండాలి- తముఆనందం పొందలేని—ఇతరుల్ని ఆనందింపజేయలేని జీవితోలోకానికి ఏమీ పనివుండదు. మీరు ఆ కథ చెపితే మన ముగ్గురికీ ఆనందమే' అన్నాను.

'నిజంగా అ కథ అంతే' అన్నాడు. 'కాని దాని పర్యవసానం చాలావుంది-దాన్ని 'ఈ పాటలో చెపుతాను విను.'

అతడు ఆ పాట పాడుతూంటే నా మనస్సు ఒక్క చోట నిలచిందికాదు. పరుగూ-పరుగూ-పొలాల్లోంచి పని లోకీ-పనుల్లోంచి పనివారి గుండెల్లోకి అక్కడవించి ప్రతిజీవ నాడిలోకి-ప్రతి అణువులోకి ప్రాకింది.

ప్రతి కంటిలోకీ తొంగిచూచింది. ప్రతి యింటిలోకీ కాలిడింది.

అక్కడక్కడ ఏమివున్నై? భగ్నహృదయాలు. నిరాశాపూరిత జీవితాలు, అపార దుర్వ్యాధలు.

అదేమీ పెద్ద పాటకాదు-వ్రాయడానికి నాకు రాదు కూడాను.

కాని,

ఇప్పుడిప్పుడు ధర్మదేవత బిడ్డల్ని తానే మేలుకొలుపు కొంటూవున్నదనీ-ఏదో వ్యామోహంలోపడి-తమని తామే మరిచిపోయివున్న 'జనం' త్వరలోనే లేస్తారనీ - అతడు పాడాడు-ఆ పాటలో వినపడ్డ విశ్వాసం అతడి సందేశాన్ని బలపరచింది.

తిరుపతిరావు ఆ పాటలోనే నిద్రపోయాడు-వృద్ధుడు చూపులోనే చూపులు ఆపేశాడు, ఇంకనేను ఒక్కణ్ణే మెలుకువతో వున్నాననుకొన్నాను. ఆ అర్ధరాత్రి సమయాన్ని కూర్చున్నాను-కూర్చున్నాను-నిద్రరాలేదు-ఆ గుబురు పైరు మొక్కల్లోంచి చల్లనిగాలి చక్కిలిగింతలు పెడుతోంది. పురుషోత్తం సమాధిదగ్గిర ఏవేవో వెలుగులు కనిపించి పిలిచాయి.

నెమ్మదిగా సమాధికేసి బైలుదేరాను——నేను వెళ్ళే కొలదీ ప్రశాంతి, భయంకరం అవుతూవుంది. అది దుర్భరమైంది——నాకు వాతావరణం చాలా తేలిగ్గా అయింది. అదేవదో మాట్లాడుతుంది. ఏదో వినరాని నిశ్శబ్దం చెవుల్లో గింగురుమంటూంది——వెళ్ళేకొలదీ చీకటి దట్టమైపోతోంది-అది చేతికి తగులుతోంది.

ఇక పోలేకపోయాను——నిట్టూర్పు విడిచాను. వెనక్కి తిరిగి చూచాను. ఏమీ కనుపించలేదు.

'సఖా!' అని వినిపించింది ఒకసంబోధన—— 'సఖా! నేనెంత తపిస్తున్నానో చూడు.'

ఎక్కడ చూడాలి? అంతా చూచాను——కనపడనిది ఏదో కనపడుతూంది అంతే.

ఉక్కిరిబిక్కిరి అయ్యాను, కళ్ళు విప్పాను.

ఆ వృద్ధుడు పాడుతూనే వున్నాడు. ఆ లాంతరు వెలుగుతూనే వుంది. అబ్బ! నిద్ర!!

'నాకు బోధించారు నిద్ర మంచిది కాదని' అన్నాడు నవ్వాడు.

నేను అలాగే కళ్ళు మూశాను. అతడు పాడుతూనే వున్నాడు.

'ఓ పంట తల్లీ,
ఓ పైరువల్లీ,
పలవింప కోయమ్మ
పంట పండోయమ్మ'
'పంటతో మీ యిళ్ళు
బంగారమౌనా!
పంట పొలములు చూడ
పంట యిండ్లనుచూడ
ఒకటి కలకలలాడు
ఒకటి తెలతెలవోవు
పంటతో మీ యిళ్ళు
బంగారమౌనటో!
మేలుగాదోయీ!
మేలుకోవోయీ!'
'గాఢాంధభిత్తికా
గారమందున్నావు
ఫలచుమన్నావు నీ

పిలుపెవ్వ రాలింత్రు?
ఆలించి విన్నెవ్వ
రేలీల వీక్షింత్రు?
వెడలిరావమ్మా—మా చేల
నడిచిరావమ్మా
విహరింపుమమ్మా—మా పైరు
పీడులో వేడ్కతో
చీకటులు నిలువలే
వేకువలు గలుగునే
మేలుకొంటాము నీ
మేలుకొల్పులలోన
మేలుగాదోయమ్మ
మేలుకొల్పోయమ్మ
ఓపంట తల్లి!
ఓపైరు తల్లి!
.... .... .... ....
.... .... .... ....'

సఖా!

లేఖ ఆలస్యం అయింది, క్షమించాలి.

ఏరోజు కారోజు తిండి వెతుక్కోవడంతోటే సరి పోతుంది. తిండి వెతుక్కోవడం అనేది పెద్దపని. కూలీలకు అదే జీవితం.

తిండి వెతుక్కోవడమే ఆశయమా జీవితానికి? ఉదర పోషణమేనా ఉద్యోగం బ్రతుక్కి?

రాత్రింబవళ్ళు పనిచేయడం – రెక్కలు ముక్కలు కొట్టుకోవడం, ఉడికీ ఉడకని (ఆకలిచేత) చాలీచాలని (యజమానుల స్వార్థం మూలాన్న) గంజినీళ్ళతో కడుపు నింపుకోవడం– మళ్ళీ విశ్రాంతి అనేదే లేకుండా పనికిపోవడం—ఇంతేనా ప్రపంచంలో ఈ పేద జీవులికి?

ఈలాంటి ప్రశ్నలతో తెల్లవారింది. రాత్రిఅంతా కునుకు అన్నదే లేదు నాకు.

ఒకప్రక్క ఆకలి—ఒకప్రక్క అర్థంకాని జీవిత సమస్యలు—వేపుకతిన్నాయి నన్ను రాత్రంతా.

ఈ కూలీ అనే సంఘం ఎందుకు వునికిలోకి వచ్చింది అనేప్రశ్న బాధించింది. ఆ బాధతోటే లేచాను ప్రక్క మీాదనుంచి.

'బాబూ ఏదో చూడుమరి' అన్నది మాయమ్మ. మా చెల్లె నా ముఖంవంక చూస్తుంది పేద చూపులు. నాగుండె దడదడ లాడింది,

ఏం చూడాలి? లేస్తూనే అలా ఎక్కడికో పోయాను- ఎందుకో తెలీకుండానే.

'నీవుకూడా రారాదా?' అన్నాడు సుబ్బయ్య. 'కామందులు పనిమీద ఏమన్నా ఇస్తారేమో అడగడానికి వెళుతున్నాం.'

'ఏం ఇస్తారు? వాళ్ళకి ఏంపట్టింది ఇవ్వడానికి? కూలీలు చస్తే వాళ్ళకేం- బ్రతికితే వాళ్ళకేం? వాళ్ళకు పనే కావల సింది. ఆపని వున్నప్పుడు కాని మనవంక చూడరు. ఒకవేళ ఇచ్చినా సగానికి సగం నష్టమేగా?'

'మరేం చేస్తాం? పూర్తిగా చావడంకంటే సగం బ్రత కడం మేలుకాదా?'

'ఐతే మీరు వెళ్ళిచూడండి. నేను తర్వాత వస్తాను'

సుబ్బయ్య వెళ్ళిపోయాడు, నాకు మతిపోయింది.

తిరిగి ఇంటికి వెళదాం అనుకొన్నాను. అడుగుపడ్డది కాదు. కామందు దగ్గరకే ఎందుకు వెళ్ళగూడదు? ఏదో మాదిరిగా ఈవేళ కడుపు చల్లార్చుకొంటే రేపటిమాట చూచుకోవచ్చుకద?

సుబ్బయ్యకూడా వెలితేనే బాగుండేది. వొక్కణ్ణే, అయితేమాత్రం?

ఏదో విధంగా-అటునుంచి నరుక్కురమ్మని-కామందు ఇంటికి వెళ్ళాను.

చావడిలో కూర్చున్నాడు చీట్లపేక దగ్గిర.

'ఓహో! నీవా?' అన్నాడు, 'ఎందుకు వచ్చావు!'

'నేనా అండి- పనిమీద ఏమైనా అడుక్కు వెళదామని వచ్చానండి.' అన్నాను.

'ఉహూ!' అన్నాడు తల వూపుతూ. మళ్ళీనావంక చూడలేదు.

ఐదు నిమిషాలు- పది నిమిషాలు- అరగంట.

కాళ్ళు లాగుతున్నై, కడుపు మండుతూంది.

గంట-గంటన్నర. రెండు గంటలు.

వీధి అరుగును జేరబడ్డాను- కండచీమలు వెన్ను పట్టుకొని కరచినై.

దగ్గరవున్న మామిడిచెట్టుకు జేరబడ్డాను- క్రొత్తగా పూచిన పువ్వులగుత్తుల్లోనుంచి తేనెచుక్కలు రాలినై మీద.

ఆ అరుగు మానవ కల్పితం- ఈ వృక్షం ప్రకృతి సిద్ధం.

అయినా నాకీగతి ఏమిటి? ఎంతకాలం ఈ యజమాని వాకిట్లో ఏడ్వాలి పడి?

నేనూ మానవుణ్ణే- యజమానీ మానవుడే.

ఒక మానవుడి కాళ్ళదగ్గిర ఇంకొక మానవుడు పడి యేడ్వడం సిగ్గుకాదూ? కృత్రిమం కాదూ? దుర్గతికాదూ?

ఏమిటి ఈ ఖర్మం నాకు? ఎంతకాలం ఇలా నిలబడడం? కూర్చుంటే తప్పేమో-కూర్చోమనే దిక్కులేదే ఇంత శ్రీసౌధంముందూ!

విసుగెత్తుతూంది-వెళ్ళిపో తాను-వీడిలెక్క ఎవడికి?

నాకూ ఆత్మగౌరవం వుంది-నాకూ స్వాతంత్ర్యేచ్ఛ వుంది.

నాకూ వేడెక్కేరక్తంవుంది-అలసిపోయే శరీరంవుంది.

నాకూ టైం వుంది, నా టైంకూ కొంతవిలువ వుంది.

ఎంతకాలం?

ఎక్కడ?

నా మాదిరి మనిషి కాళ్ళదగ్గిర!

నా కాళ్లవంటి కాళ్ళువున్న వొకమనిషి కాళ్ళదగ్గిర!

సిగ్గు! సిగ్గు!

ఒక మనిషి ఇంకొక మనిషికి చాకిరీ చేయడం ఎంత నీచం!

మనుష్యులు అంటే ఎంత వుపేక్ష ఈ వ్యక్తికి!

ఒకమనిషి తనతోడి మనిషిని వుపేక్ష చేస్తున్నాడంటే; అతడు తనలోవున్న మనుష్యత్వాన్ని చంపుకొన్నవాడన్న మాట.

ఇటువంటి మనుష్యత్వం చచ్చినవాళ్ళతోటి నాకేం పని?

'కానుకనై ధరాధిపుల
కాళ్ళకడన్ బొరలాడి
వాడిపోలేను....'

నిజం—నిజం.

లేచాను వెళిపోదాం అని.

కాని, కాళ్ళు సాగవు. ఎక్కడికి వెళ్ళడం? గుండె మండింది-కన్ను మూతపడింది.

'....జననీ నయనారుణ
దుఃఖబాష్ప బాధానల
ధార యొండు శైలమైనది
నాహృదిమీద మండుచున్.'

ఎక్కడికి వెళ్ళడం? ఇంక ఎవరు ఎరుగుదురు నన్ను?

డబ్బు కావాలి బ్రతకడానికి, ఎవరిస్తారు? ఎక్కడి నుంచి వస్తుంది?

ఒకవేళ ఎక్కడినుంచి అయినా వచ్చినా, మమ్మల్ని ఎవరు తిననిస్తారు?

ధనవంతుల హుకుం చెలాయిస్తుంది. ప్రపంచంలో కూలీలు కూలిపోతున్నారు.

అసలు కూలీసంఘం ఎందుకు పుట్టాలి? ఇలా దేవురించడానికేనా?

ఇలా మాడడానికేనా? ఇలా అవమానాలతో కృశించి నశించిపోవడానికేనా?

దుఃఖం కంఠంవరకూ వచ్చింది నాకు. కన్నీరు కోలకుల దాకా నిండింది.

పకపకా నవ్వాడు యజమాని ఆసౌధంలో. వలవలా యేడ్చాను నేను ఆ నేలమీాద కూలబడి.

నా స్వాతంత్ర్యాన్ని కాల్చేయాలనీ—నా అభిమానాన్ని పాతేయాలనీ-నా జీవితాన్నే మ్రింగేయాలనీ-ప్రయత్నించే యజమానివాకిట్లో నేనెందుకు నిలవాలి?

యజమానికి నేనంటే కిట్టదు—నిరంకుశులికి ఎవళ్ళకీ కిట్టదు అన్యాయాన్ని ఎదిరించే వాళ్ళంటే.

లేచాను ఇంకోసారి—పోదాం అని.

ఎక్కడికి?

ఇంటికి.

ఒకపక్క కూలిపోతూవున్న ఇంటికి?

శుష్కించిన శరీరాలతో — ఆకటిచిచ్చులో కాలిపోతూ- నన్నే ఆలోచించుకొంటూ-ఆకాశవీధులలో ఆలాపించే నాతల్లి దండ్రుల దగ్గరికి-నిరాశతో!

అన్న వస్తాడు-ఏదో తెస్తాడు—అని గంపెడాశతో-నేను వచ్చేమార్గం కాచుకొని ఎదురుచూస్తూవుండే నా చెల్లెలి దగ్గరికి- వట్టిచేతులతో!

దుర్భరం!

ఇంటికి పోలేను.

ఇక గత్యంతరం?

ఆత్మహత్య.

మిత్రమా! ఆత్మహత్య అనుకొనేసరికి ఎలావుంది అనుకున్నావు నా మనస్థితి?

నేను ఆత్మహత్య చేసికొంటే?

వలవల యేడ్చేస్తారు - పలపల బాదుకొంటారు- మలమల మాడి చచ్చిపోతారు నా తల్లిదండ్రులు. ఆ అవస్థ!

ఆ కడుపుకోత! ఆ కన్నీటినిప్పు! రంపంకోత కోయదూ, నిలువునా చీరెయ్యదూ నా ఆత్మని?

అయినా—

ఆ పాపం నాకు కాదు, నా ఆత్మహత్యకి కారణం అయిన వాళ్ళకి. రాసులు రాసులు ధనం పాతళ్ళు వేసికొని-ఆకలి అని అడిగితే లేదనే వాళ్ళకి. మొదట సంఘంలో ఈ అసమత్వం పునాదులు వేసినవాళ్ళకి, యజమానిత్వం, సేవకత్వం లోకంలో ప్రవేశ పెట్టినవాళ్ళకి. నాకు కాదు.

కాని-ఆత్మహత్య!

చేసికొని ఏమి చేయను? అబలు డంటారు- అనామకు డంటారు- జాలిపడతారు- హరించిపోతారు.

నిరంకుశత్వాన్ని ఎదిరించలేక- అన్యాయాన్ని అరికట్టలేక ఆత్మహత్య చేసికోనా?

లేక—

అడుగు అడుక్కీ అణగద్రొక్కుతూ- అనుక్షణమూ అవమానిస్తూ- ఆకటిచిచ్చులో నన్ను త్రోచి, తాను సౌఖ్యయాత్ర సాగిస్తూవున్న నిరంకుశత్వంముందు అభిమానాన్ని చంపుకొని బ్రతికి వుండనా?

అక్కడ నిలవలేక పోయాను- అక్కడినుండి కదల్లేక పోయాను.

అప్పటికి మధ్యాహ్నం అయింది.

'ఏం? వంకావాలోయ్? అన్నాడు కామందు బైటికి వచ్చి, సంగాతగాళ్ళని సాగనంపుతూ.

నేనేమీ చెప్పలేను. అతని మొగంవంక కన్నె త్తి చూడ్డానికి నాకు అసహ్యం వేసింది.

కాని,

ఏమైనా అడిగితే ఇస్తాడేమో! అడిగిచూస్తే? అని ఆశ-

ఈ ఆశకు కారణం నా తల్లిదండ్రుల ఆకలి.

నోరిచ్చి అడిగాను- లేదన్నాడు.

కాళ్ళు వొణికాయి- నాళ్ళు సడిలాయి- చెమ్మటల్లు పోశాయి—

ఈ అవస్థఅంతా ఎందుకు వచ్చింది? ఒకళ్ళమీద ఆధారపడడంవల్ల కాదూ? నాలుగుడబ్బులు సంపాదించుకో గలిగే స్వతంత్ర కృషి లేకపోవడంవల్ల కాదూ?

కూలీగానే పుట్టి- కూలీగానే పెరిగాను- జీవితం అంతా కూలీయాత్రే సాగించ దలిచాను- ఏరోజుకు ఆరోజు కూలిపని చేసికొని బ్రతకడమే పుట్టినందుకు ఫలం అనుకున్నాను.

ఇతరులు అనుభవించే సౌఖ్యాలు- చెలాయించే అధి కారాలు- వర్తించే ఇష్ట ప్రవర్తనాలు- చూచి, వాళ్ళ— పూర్వపుణ్య ఫలవిశేషం అనుకున్నాను.

అయితే—

పూర్వ పుణ్యఫలం పేకాటలు ఆడుమంటుందా? నిరు పేదల్ని హింసింపమంటుందా? దుర్నడతలు నడిపిస్తుందా? కాఠిన్యంలో క్రూరమృగాలకంటె అధములుగ చేస్తుందా!

వట్టిది.

బహుశా (అటువంటిది ఏమైనావుంటే) అది పూర్వ పాపఫల విశేషం అయివుంటుంది.

ఇతరుల్ని హింసించేది (మానసికం- శారీరికం- ఎటువంటి హింసఅయినా సరే-) పాపమే అయివున్నప్పుడు దాన్ని ఎదిరించాలి కాదూ!

ఎదిరించాలి.

నాకు మతిపోయింది——బానిసత్వాన్ని త్యజించాలి. బానిసత్వానికి భయంపడి మృగాలే- పక్షులే- ప్రతి జీవికూడా పారిపోతాయికదా దూరదూరంగా! అలాంటప్పుడు యీ మానవులకి అది నిత్యజీవనం అవుతూంది. బానిసత్వం లేకపోతే బ్రతుకుతెరువే కనబడడం లేదు. నిరాశ!!

నిరాశ ఎందుకు? ఆత్మహత్య ఎందుకు? స్వతంత్రంగా జీవించలేనా? నా స్వాతంత్ర్యానికి అడ్డువచ్చే ఏ ప్రకృతినైనా సరే ఎదిరించలేనా! ఎదిరించి నిలవలేనా?

ఇక నేను ఇక్కడ నిలవను, పట్టిచేతులతో నా తల్లిదండ్రులదగ్గిరికి వెళ్ళను.

'తల్లికడుపు చిచ్చు
చల్లార్ప లేకుండ,
కన్నీటి కంటితో
కలత' పెట్టలేను.

ఇక గత్యంతరం!
స్వతంత్రజీవనం! స్వయంకృషి!
ఎట్లు!
తరువాత వ్రాస్తాను. ★

మిత్రమా !

'పల్లెటూళ్లుగురించి నీవు వ్రాసేదంతా నిజమేనా'అని అడుగుతున్నావు. 'నిజంగా అంత దుస్థితిని పల్లెలు అనుభవిస్తున్నాయా' అని సంశయిస్తున్నావు. అవును నీకేం! తీరుబడిగా ఏ చదరంగమో ఆడుకొంటూకూర్చునే నీకు, రాత్రింబగళ్లు కష్టపడి పనిచేసుకొని జీవించేవాళ్ళ కష్టాలు యెలా బోధ పడతవి!

'ఎప్పుడూ పల్లెటూళ్ళగొడవే వ్రాస్తావు, ఎన్నికలు వస్తున్నవి. చూస్తున్నావా! నీవు ఏ పక్షానికి చేరతావు!' అని వ్రాస్తున్నావు! హృదయం మండుతున్నది, కడుపు కాలుతున్నది. ఏ పక్షానికి చెందాలి! ఎందుకు చెందాలి! ఎన్నికలు వస్తుంటే ఏమిచేయాలి! ఎందుకు యెన్నికలు! ఏమి తినడానికి! అవి మాకెందుకు పనికివస్తవి?

ఇప్పుడు శాసనసభలు మా పల్లెటూళ్ళకు ఎంత మేలు చేస్తున్నవో, ఇకముందుకూడా అంతే చేస్తవి.

మిత్రమా! ప్రభుత్వము ధనవంతులది. శాసనసభలు ధనవంతులవి. ఉద్యోగాలు ధనవంతులవి. అధికారాలు ధనవంతులవి. అంతే. పేదలకు ఒకటేమార్గంవుంది బ్రతకడానికి, అది ధనవంతులదగ్గర సేవకావృత్తి!

సేవకావృత్తి తప్ప మరొకమార్గం కనుపించడంలేదు పేదలకు. ఎంతకాలం ఒక పరిపూర్ణ పరిణామం రాకుండా ఈ ప్రపంచ పరిస్థితులు ఇదే విధంగా వుంటాయో, అంతకాలం

ధనికులకు అధికారమూ, పేదలకు సేవకావృత్తి తప్పవు. ముమ్మాటికీ తప్పవు.

ఇక —

ఆ పరిపూర్ణ పరిణామం ఎలావస్తుంది !

ప్రభుత్వం తీసుకొస్తుందా ఆ పరిణామాన్ని !

శాసనసభలు తెస్తవా !

మీ పట్నాలు తేగలవా ?

నీకు లేఖ వ్రాయాలని ఇంతవరకూ వ్రాశాను. దేశం బాగుపడాలంటే నేటి సంఘస్థితి మారాలి. ఏ విధంగా మారాలి అని ప్రశ్నించుకొని ఆలోచిస్తూ, చేతిలోని కలాన్ని నోటిలో పెట్టుకొన్నాను పరధ్యానంగా. నోరంతా సిరా అయింది.

కలాన్నీ కాగితాలనూ నేనుకూర్చున్న మంచంమీద పెట్టి నోరు కడుగుకోడానికి నూతిదగ్గిరకు వెళ్ళాను. అక్కడకు ఒక అమ్మాయి పరుగెత్తుకుంటూ వచ్చి 'మా తాత పుత్తరం చదవడానికి రమ్మన్నాడు మిమ్మల్ని' అన్నది.

'ఇక్కడకు తేలేకపోయినావా?' అన్నాను. 'అక్కడ చాలామంది వింటారంట' అంది. నీ లేఖ అంతటితో ముగిసింది.

పేదలకు సేవకావృత్తే జీవనమార్గం అని చెప్పాను. ఆ సేవకావృత్తికూడా దొరక్క—— చాలమంది కార్మికులు విదేశాలకు పోతారు. అక్కడినుంచి ఇళ్ళకూ — భార్యకూ —

బిడ్డలకూ ఏమైనా పంపిస్తూవుంటారు. జ్ఞాపకంవచ్చినప్పుడల్లా వుత్తరాలు వ్రాస్తూ వుంటారు.

ఇప్పుడు నన్ను చదవగోరిన వుత్తరం ఆ తెగలో వచ్చింది. ఒకటే వుత్తరం. ఒక్కరికే. కాని—అక్కడ పది హేనుమంది గుంపుగూడారు! ఎందుకు? ఏమి సంగతులున్నవో, విదేశాల్లో తమభర్తలు ఏమిచేస్తున్నారో, ఎట్లా వున్నారో, ఏమో, అని—సంగతులు విందామని— ఆశ! ఆకాంక్ష! ఉత్తరంవచ్చిన ఆమెకు పొగడ్తలు! కడకు ఆ ఉత్తరంలో ఏముంటుందో!

సఖా? చూచితివా? విదేశాలలో కూలిపనిచేసే ఒక ప్రాణంమీద ఆధారపడి - స్వదేశంలో - భార్య, బిడ్డలు, ముసలి తల్లిదండ్రులు, చుట్టాలు, సిబ్బందీ... ...

అంతట్లోకే 'బాబు, బాబూ! ఈ పద్దు వ్రాసిపెట్ట' మని ఒక ఆమె వచ్చింది.

'ఏమి పద్దు?' అన్నాను.

'కోకను మూడు పావులాలకు తాకట్టుపెట్టాను ఈవేళ, ఆ పద్దు' అన్నది.

కోక! తాకట్టు మూడుపావులాలకు!

మిత్రమా! దుస్థితిఅంటే ఇప్పు డవుతుందా అర్థం?

కోక తాకట్టు! మూడుపావులాలకు!

'ఏమండోయ్! ఈ పద్దుకూడా వ్రాసివెళ్ళండి, ఎక్కడికి వెడుతున్నారో' అన్నాడు ఒకతను.

'ఏమిటి, పద్దులన్నీ ఈవేళేవస్తున్నవి! ఈవేళ ఏదైనా మంచిరోజా?' అన్నాను – ఈ రోజుల్లో చదువుకొన్న వాళ్ళకు తిథులూ, వారాలూ, వగైరాలు జ్ఞాపకం వుండవు కదా!

'మరేనండి. ఈవేళ శనివారం' అన్నాడు.

'అయితే?'

'సంత.'

'అయితే?'

అతడు నావంక చూచాడు, నా కపు డర్థమైంది.

అతనికొడుకును – ఎనిమిదిఏండ్లు వుంటాయి మూడవ క్లాసు చదువుతున్నాడు – ఒక ఇనాందారుని దగ్గిర పాలేరు తనానికి కుదిర్చాడు, సంతఖర్చుకు డబ్బులు తీసికొని!

'చదువు మానిపించావా?' అన్నాను కొంచెం కోపంతో.

'ఏమిచేయనండి? మింగడానికి మెతుకులేదు మీసాలికి సంపెంగనూనె ఎందుకు మాకు?'

'డబ్బు – డబ్బు – డబ్బు – ప్రతి వస్తువుకీ డబ్బు కావాలి. కాని ఎలా వస్తుంది? ఎన్ని రోజులు పస్తులుపడి బ్రతకగలం? ఇప్పటికే శవాకారాలు వచ్చినై.'

'అందుకని పెద్ద ఈనాందారు దగ్గర కుదిర్చాను కుర్రాణ్ణి. ఏదో తిప్పలుపడాలి కదాండి – రాసేద్దురు రెండు ముక్కలు' అన్నాడు అతడు దీనంగా.

సఖా! పేద తలిదండ్రులు తమబిడ్డల్ని భుక్తికొరకు అమ్ముకుంటున్నారు, ధనవంతులు కొంటున్నారు. కొని, ఉపయోగించుకొంటున్నారు పనిముట్లులాగ.

ధనవంతుల్లోకల్లా ప్రభుత్వమేకదా అధిక ధనవంతమైంది? ఈ పేదబిడ్డల్ని తానే కొని విద్యావంతుల్నిగా ఎందుకు చేయగూడదు? దేశంలోని అధిక సంఖ్యాకులు అభాగ్యులై, అజ్ఞానులై నశించి పోతుండగా ఈ ఉద్యోగులందరూ ఏమి పనిచేయడానికి! ఇంత ధనం ఎక్కడ పారబోయడానికి?

ఆ చిన్న చేతుల్లోని పుస్తకాలను లాగి చింపివేసి - ఆ కురుచచెడ్డీని తీసి గోచీనిపెట్టించి - ఆ కలాన్ని ఊడదీసుకొని కర్రను చేతికిచ్చి - బాలకాంతులు చిందుతూండే ఆ చిన్నారి మొగాన్ని దాస్యదుఃఖ దూషితాన్ని పూసి—

ఆ బాల్యక్రీడాశక్తిని కామందు కాళ్ళకుకట్టి -

ఆ బాలుని జీవితాన్ని ఎలా వ్యర్థంచేస్తున్నారో తల్లిదండ్రులు చూడు! ఆ దోషం తల్లిదండ్రులదా? పేదరికానిది. పేదరికానిదా? సంఘానిది, సంఘానిదా?

రెండు పద్దులూ వ్రాశాను. నా కొరకు ఎదురు చూస్తూన్న గుంపుదగ్గిరకివెళ్ళాను. కూర్చోమని ముక్కాలు పీట వేశారు. కూర్చున్నాను, ఉత్తరం అందుకుని విప్పాను.

'చిరంజీవి ... పరిస్థితులు మునుపటిలాగ లేవు ... పనులు లేవు ... ఏదో విధంగా గడుపుకోవలెను ...'

మొదట ఉత్సాహంతో తెల్లగావున్న వారిమొగాలు నల్లగా అయినవి. అందరూ ముఖాలు ముడుచుకొని ఎవరి యిండ్లకు వారు పోయినారు.

ఆ వుత్తరంలోనే ఒక ఖాళీకవరు వున్నది జవాబు కోసం. చాలా గ్రామాల్లో పోస్టాఫీసులు వుండవు. ఉండినా కవర్లు, కార్డులు దొరకవు. దొరికినా కొనుక్కోడానికి చాల మందికి డబ్బువుండదు. అందుకని ఆ వుత్తరంలో ఖాళీకవరూ ఒక తెల్లకాగితమూ పెట్టినాడు ఆమెభర్త.

వెంటనే జవాబు వ్రాసిపెట్టమన్నది. వ్రాశాను.

'మ. రా. శ్రీ ... వుంతలో ఇల్లుకూలిపోవడానికి సిద్ధంగా వుంది ... వర్షం అంతా ఇంట్లోనే వుంటుంది. బాగుచెయ్యడానికి డబ్బులేదు. పైగా భూమికి పన్ను యెక్కువకట్టాగు...'

మిత్రమా! ఇక్కడ ఒక్కమాట – సర్కారు ఇళ్ళు లేనివాళ్ళకి ఇళ్ళస్థలాలు యిచ్చారు వుంతల్లో. ఆ స్థలాలకి పన్ను గట్టారు! చూచావా వింత ఔదార్యం? పనికిమాలిన వుంతలు పేదలకిస్త పన్నులు గుంజడానికేనా? అట్లు పన్నులు చెల్లించనివాళ్ళని ఇళ్ళువిడిచి లేచిపొమ్మన్నారు! చూచావా వింత పరిపాలన? ఎక్కడికి లేచిపోవడం? స్మశానంలోకి!

'... చిన్నపిల్లవాణ్ణి మామిళ్ళవారికాడా – పెద్దపిల్లను పెద్దకామందుల దగ్గిరా పాలేరుతనాలకు కుదిర్చాను ... పెద్ద కామందువారి తోటలోవున్న పాకలోకి కాపరం రమ్మంటున్నారు ... వెళ్ళడమా? వద్దా? ...'

ఉత్తరం వ్రాయడానికి నా కలం నడిచింది కాదు. 'అబ్బా! ఇంత దౌర్భాగ్యస్థితా!' అనిపిస్తుంది నీకు. కాని

పల్లెటూళ్ళ - వాటిలోనూ పేదల - దౌర్భాగ్యస్థితి వర్ణించ డానికి నాకు శక్తి చాలడంలేదు.

ఉండడానికి ఇళ్లులేనివాళ్ళు యెన్నో లక్షలమంది వుంటారు భారతదేశంలో— భిక్షుకులూ, కొండజాతులూ కాకనే. జమీందారుల, ఇనాం దారుల, కామందుల, భూముల్లో- చిన్న చిన్న పాకలు వేసికొని అందులో నివసిస్తూ వుంటారు, వారికి చాకిరీచేస్తూ. జీవితకాలమంతా అదే మాదిరి, అదే బ్రతుకు.

మా యింటికికూడా చావడికి తలుపుల్లేవు. నేను తిరిగి వెళ్ళేటప్పటికి చావడిలోదూరి - మంచంమీదవున్న కాగితాల్నీ కలాన్నీ క్రిందకుపడేసి అల్లరిచేసింది మా ఆవు. నీకు లేఖ మళ్ళీ ప్రారంభించి వ్రాయాలి. తరువాత వ్రాస్తాను.

ఒక్కమాట 'క్రిష్టమసుకు ఆ అడవుల్లోనే వుంటావా, పట్నం వస్తావా?' అని అడిగావు. గ్రామాలు అడవులుగావు- 'శాంతిసదనారామాలు,' నేడు ఎంత దుస్థితిలోవున్నా ప్రపం చానికి మార్గదర్శకమయ్యేది ఒక్క గ్రామమే. గ్రామంలో వుండే సౌఖ్యం మరెక్కడా వుండదు. గ్రామం ప్రేమకు పుట్టిల్లు.

ఇక విరమిస్తాను, సెలవు.



మిత్రమా !

పల్లెటూళ్ళకు నీవు కనబరచిన సానుభూతికి సంతోషము. కాని నీ లేఖ నాలో ఒక వింతభావమును కలిగించినది. ఆ భావం నీ సానుభూతినుండి కాదు, నీ నిర్లక్ష్యమునుండి. అది నా సంతోషఫలితం కాదు, నా నిరాశఫలితం. నీవు పల్లెటూళ్ళపట్ల గనబరచిన నిర్లక్ష్యానికి నీకై నాకు గలిగిన కోపఫలితం.

నీకు నా కృతజ్ఞత ఎంతమాత్రమో, నా కోపమూ అంతమాత్రమే. నీ కేమి ? నిత్యపట్నవాసివి. నితాంతభాగ్యశాలివి. జనపదాలకు నీవు రానూ రావు; జానపదులు పడే పాట్లు నీవు చూడనూ చూడవు. 'ఆ పాట్లు ఇలా వుంటాయి' అన్న ఆలోచనే వుండదు నీకు. చీకట్లోవున్నవాళ్ళు వెలుగు కోసం తహతహ లాడతారు. కాని వెలుగులో వున్నవాళ్ళకు చీకటి సంగతి ఏమి పడుతుంది ?

నిష్ఠూరంగా వ్రాస్తున్నానని ఏమీ అనుకోకు. నిజంగా నీ లేఖ చూడగానే నాకు చాలా విచారం కలిగింది. 'దీపావళికి లక్షలు ఖర్చుచేశారు మా పట్నంలో. మా యింట్లో కూడా క్రొత్త బట్టలకు, విందులకు, యెక్కువగా బాణ సంచాకు, ఖర్చుఅయింది' అని వ్రాశావు. సంతోషం. కాని ఆ వేళ మా పల్లెలో ఎంతమంది పస్తు వున్నారో, పండుగ పూట పస్తు వుండరాదని తవ్వెడు - సోలెడు - బియ్యంకోసం కొందరు యెంత అవస్థపడ్డారో కొంచెం వ్రాస్తాను— చిత్తగిస్తావా ?

పండుగ రోజున సాయంకాలం - మా వూరు బడి పంతులూ, నేనూ షికారుకు బైలుదేరాం వీధులంట — పండగ విలాసాలు చూద్దాం అని. మావూళ్ళో అన్నికులాల వారూ వున్నారు. అన్నిరకాల ఇళ్ళూ వున్నై. అన్ని విధాల మనుష్యులూ వున్నారు. అన్ని తరగతుల కష్టాలూ వున్నై. కాని— అన్ని ... అక్కర లేదు, కొన్ని అయినా సౌఖ్యాలు లేవు.

'తాతగారూ ! పండగ సందడి ఏమీ కనబడడంలేదే!' అన్నాడు పంతులు. చితికిపోయిన ఆ పెంకుటింటి సగంవిరిగిన ఆ అరుగుమీద కూర్చున్న ఆ వృద్ధ రైతు, 'ఏం పండగ బాబూ! మునుపటి రోజులా, మునుపటి లోకమా?' అన్నాడు. 'ఏమి అల్లా అంటారు?' అన్నాడు పంతులు మళ్ళీ.

'పూర్వం ఈ అరుగులనిండా ప్రమిదెలు వెలిగించే వాళ్ళం -' ఆ వృద్ధునికంఠం మారింది, గుటకలుమింగుతూ అన్నాడు 'మా వూళ్ళో - ఈరోజు వచ్చేటప్పటికి - యెంత మంది మా పందిట్లో వుండేవారు ! ఎంతమందికి సంతర్పణ జరిగేది ! ఎంత మంది కాల్చేవాళ్ళం ! ఎంత ఆనందం చేసే వాళ్ళం ! ధరలు పడిపోయాయి. మా కొంప కూలిపోయింది! ఇంకెక్కడి పండుగలు - ఇంకెక్కడి ఆనందం' సగంలోనే ఆపేశాడు. ఇక చెప్పలేకపోయాడు.

పూర్వపురోజుల్ని జ్ఞాపకంతెచ్చి ఆ రైతుకు దుఃఖం కలిగించినందుకు పంతులు పశ్చాత్తాపపడ్డాడు- 'తాతగారూ! ముందు ముందు మంచిరోజులు వస్తాయి లెండి' అనిమాత్రం అన్నాడు.

'నాయనా! ఇక ముందు మంచిరోజులు వస్తాయా? నీకు నమ్మకంవుందా? ఏమో, నాకుమాత్రం నమ్మకంలేదు. అలు చూడు, ఆ యిళ్లు ఎంత శిథిలంగా వున్నాయో! అన్నీ ఒక ప్రక్క కూలిపోయినవే. ఏడుతరాలనాడు కట్టిన యిళ్ళవి. కూలిపోక ఆగుతాయా? బాగుచేయించుకోడానికి డబ్బువేదీ? ఆ సగంకూలిన చివుకు కొంపల్లోనే కాపరాలు చేస్తున్నారు.

అంతకుముందే వేసిన కలయంపి ఆరిపోవడంచేత ఆ యింట్లోనుంచి ఒక అమ్మాయి వచ్చి వాకిట్లో ముగ్గులు పెట్టడం ప్రారంభించింది ఆ వాకిలిని చూచి తక్కిన వాకిళ్ళన్నీ పారజూచాము. అన్నీ కలకల్లాడుతూనే వున్నై. కాని ముగ్గులు నల్లగావున్నై. ముగ్గులుపెట్టే బాలికల ముఖాలు ఆనాటి అమావాస్యలాగే వున్నై. వారివిచారానికి కారణం నీకు వేరే వ్రాయనక్కరలేదు. దుఃఖం స్వభావం అయిపోయింది పల్లెటూళ్ళకు. ఆ ముగ్గు అంత నల్లగా వుండడానికి కారణంమాత్రం నీకు చెబుతాను. ఇటికఆవములలోని తెల్లటి బూడిదను ముగ్గులో కలుపుతారు. ఎందుకు? ముగ్గు చాలక, చాలినంత కొనుక్కోవడానికి డబ్బులేక. అందుకే ఆ ముగ్గు అంత నల్లగావుంది.

'ఆ ముగ్గులే ఇళ్లల్లో మనుష్యులున్నారని ఆనవాలు. లేకపోతే ఇవి మనుష్యులు కాపురంచేసేయిళ్ళుఅని ఎవరన్నా అనుకొంటారా?' అన్నాడు ఆ వృద్ధుడు – 'చూడండి ఎక్కడా టపాకాయల చప్పుడైనా వినబడడంలేదు. ఈ పండగ అంటే చిన్నపిల్లలు ఎంతో ఉత్సాహం పడతారు.

కాని ఇప్పుడు ఏ బిడ్డముఖంలోనూ కళలేదు. ఏ బిడ్డ నరా ల్లోనూ ఉత్సాహం లేదు.'

మిత్రమా! ఆ రైతు చెప్పే మాటలన్నీ నిజమే, ఆ 'ముగ్గు'లే లేకపోతే అవి మనుష్యులు నివసించే కొంపలని అనుకోవడం చాలా కష్టం.

ఒకనాడు — మనం టూర్లానుఫిల్మ్‌కు వెళ్ళినప్పుడు — ఆ ఆఫ్రికా అనాదివాసుల్ని చూచి 'ఎంత అనాగరికత మూర్తీభవించింది' అన్నావు జ్ఞాపకంవుందా? నేడు నీవు పల్లెటూళ్లువస్తే — ఈ నవయుగంలో భారతదేశం యెంత అనాగరికస్థితిలో వుందో — తెలిసికొంటావు. నిజంగా దుఃఖి స్తావు. అప్పుడు నీ ఉద్యోగకాంక్ష మాయమైపోయి, మానవ సేవావిధి హృదయంలో నాటుకుంటుంది. అందుకనే నిన్ను మావూరు తీసికొనిరావడానికి నేనెంత ప్రయత్నించినా మీ నాయనమ్మ రానిచ్చింది కాదు. నీవుకూడా మీ నాయనమ్మ మాటకు ఎదురుచెప్పలేకపోయావు.

'చూడండి, ఏ బిడ్డముఖంలోనూ కళలేదు—ఉత్సాహం లేదు' అని ఆ రైతు చెప్పినమాటల్లో ఎంత సత్యం వుందను కొన్నావు? విదేశాల వార్తలు నాకంటె నీకు ఎక్కువగా తెలుస్తూవుంటాయి. ముసోలినీ అబిసీనియాను జయించ డానికి కారకులు ఎవరు? హిట్లరు తన యిష్టంవచ్చినట్లు ఆట లాడడానికి బలం యెక్కడిది? ఫ్రెంచి — రష్యా విప్లవాలకు మూలశక్తి యేది? చిన్న చిన్న దేశాలు పెద్ద పెద్దసామ్రా జ్యాల్ని వలడానికి బలం ఎక్కడి దంటావు?

తరుణశక్తి! మిత్రమా! తరుణశక్తి ప్రపంచాన్ని పాలిస్తుంది. ఆ శక్తి భారతదేశంలో వుందా? అసలు తారుణ్యం అనేది భారతదేశంలో వుందా? అని నాకు అనుమానం. తారుణ్యంలేంది శక్తి ఎక్కడనుండి వస్తుంది?

రోజంతా కష్టపడినా ఆకలితీరేఅన్నంలేక, అన్యాయం అడుగుల క్రింద అణగిపోయి జీవనిర్జీవగతులమధ్య అల్లాడుతూ వున్న పల్లెటూళ్ళకు 'కళ' ఎక్కడనుంచి వస్తుంది? జీవం నిలబెట్టుకోడాని కా పల్లెటూళ్ళు పాట్లుపడుతున్నాయి. ఆవేదన పొందుతున్నాయి. చూచే దెవరు? ఆదరించే దెవరు? ఎవరికాక్కావాలి? పల్లెలు ఎంత యేడ్చినా పట్నాలకు వినబడదు. పట్నాలకు వినబడేటంత గట్టిగా పల్లెలు ఏడ్వలేవు. శక్తియేది?

ఆ వృద్ధరైతు దగ్గరనుండి కదిలి వీధి ఆ చివరవరకూ వెళ్ళాం. కాని మా వుత్సాహమంతా ఆ ముసలాడి దగ్గరే చల్లారిపోయింది. పండగ యేమయినా సందడిగా వుంటే బాగుండును. కాని అదీ లేదు.

ఆ వీధిదాటి రామాలయందగ్గరకువెళ్ళి నిల్చున్నాం. లోపల దిల్లిక వెలుగుతుంది. కాని అది అంత కాంతిగాలేదు.

'అబ్బ, ఎంత నిర్జీవంగా వున్నది వూరు! ఇంక ఈ వూళ్లు బాగుపడతాయా?' అనిపించింది.

'తవ్వెడుబియ్యం ఇస్తారా' అని వినిపించింది నాకు, ఆ దేవాలయం చాటునుండి.

'ఎవరమ్మా?' అన్నాను. ఆ అమ్మ ఎదరకు వచ్చింది.

'ఏమి? పండుగపూట అప్పా?' అన్నాడు పంతులు.

'ఏముందండి, ప్రొద్దుటకూడా వండుకోలేదు.'

నాకేమీ తోచలేదు. హృదయంలో మంట మండుతుంది. నా ఆవేదన నీకు వ్యక్తంచేయలేను ఎంత దుస్థితి!

ఆమె ఎక్కడినుండి బియ్యం అడుగుతుందో నీకు తెలుసునా? పురుషోత్తాన్ని నీ వెరుగుదువు. మీరిద్దరూ కలిసి కొంతకాలం చదువుకొన్నారు. నాకు దీపావళి ఆనందం ఎవరితో పోయిందో అతడే పురుషోత్తం అంటే. ఈ వూళ్ళో 'బియ్యము నిల్వ' సంఘాన్ని ఒక దానిని స్థాపించాడు. ఈ సంఘానికి సంబంధించిన కుఱ్ఱాళ్ళు చిన్న చిన్న సంచులతో వెళ్ళి ప్రతియింటా బియ్యం అడిగి ఈ రామాలయం గదిలో నిల్వచేస్తారు. ఇది ఎంత చక్కనిపద్ధతో ఆలోచించు ఆ యువకహృదయానికి కట్టిన విశ్వజనీనపద్ధతి యిది. ఇప్పటికి ఆ గది బియ్యంతో సగంనిండింది. ఆ బియ్యంలోనుండి అప్పు అడుగుతుంది ఆమె.

'ఎందాక అప్పు ఇచ్చేదండీ? ఇప్పటి కప్పుడే వంద మంది అయ్యారు!' అన్నాడు ఆ సంఘకార్యదర్శి అరుగు మీదనుంచి లేచివస్తూ.

ఎంతమంది పస్తులు పడుతున్నారు! ఎంత ఆకటిచిచ్చు ప్రతిక్షణమూ వార్ని మాడ్చివేస్తుంది! ఈ దురవస్థ తొలగడానికి యెన్నియుగాలు పడుతుంది? యెప్పటికి పల్లెలు బాగు

పడతాయి! పల్లెలేగదా భారతసౌభాగ్యము! యెంతకాలం పడుతుంది భారతదేశం బాగుపడడానికి!

మిత్రమా! మా దీపావళి దీపాలులేకుండా గడిచింది చాలినంత అన్నంలేకుండా గడిచింది. ఏ భోగాలు అనుభవించినా పట్నంలో నే, అక్కడినుండి లోకమంతా ఇలాగే వుంది అనుకొంటావు నీవు. టపటపాలతో, పూవత్తులతో, చిచ్చుబుడ్లతో, రంగు రంగులతో, రకరకాల ఆకాశదీపికలతో, బారులుతీర్చిన దీపాలతో. పువ్వులతో, ఫలములతో, విందులతో, విహారాలతో, వైకుంఠంలాగ వుంటుంది మీ పట్నం. కాని దేశంలో 90 వంతులు అంధకారంతో, ఆకటిచిచ్చుతో, ఆవేదనతో, అసౌఖ్యంతో, నిరాశతో, నిరానందంతో, చిక్కిచివికిన బ్రతుకుతో, అనారోగ్యంతో, కుమిలి కృశిస్తూవుంటుంది. సంక్రాంతికి నిన్ను మా వూరు తీసికొని వస్తానులే. అప్పుడు నీవే అనుభవపూర్వకంగా తెలిసికొందువుగాని.

కడకు నా వింతభావం ఏమిటో నీకు చెప్పనేలేదు. తరువాత లేఖలో చెప్పతాను. ఇక సెలవు,

★

ప్రియ మిత్రమా!

కొర్రలూ సోమలూ కోతకొచ్చాయీ
మినప—జనపా—యెడ్ల మేతకొచ్చింది
బలవండిరా బాబు పాలికాపుల్లూ
బాగుగా మేపండి బక్క యెద్దులనూ
శీతకాలపు దుక్కి చేయి చాచిందీ
యెండకాలపుమోట యెదురు కాచిందీ.

ఇలా పాడుకొంటూ—నాగలి భుజాన్ని వేసుకొని వస్తున్నాడు—నరుసు. ఆ పాట నేను అందుకొని...

నూవులా చేలోన నూనె పొంగిందీ,
లేయావు పొదుగులో నేయి చేరిందీ,
అమ్ముకోకుండగా ఆరగించండీ
చిమ్ముకోకుండగా చేవదేరండీ
మన గ్రామసీమల్లు మణులు పండాలీ....
మన భారతీదేవి మహిమపొందాలీః

అని పాడుతూ—ఆ ప్రక్కనివున్న దోసపాదు చాటు నుండి యెదురుపడ్డాను.

భయపడ్డాడు నరుసు, పాట మానేశాడు. దారితొలగి వెళ్ళిపోయాడు.

ఆ భయపడడమే నాకు కిట్టదు. యెందుకు భయ పడాలి! నేనూ మనిషినే—అతడూ మనిషే, నా యెక్కు వేమిటి! అతడి తక్కువేమిటి!

నేను రైతుని, అతడు పాలేరు. అతడిచేతిక్రింద ఇంకా పనిచేసేవాళ్ళు వున్నారు. నాపైన భూస్వామి ఉన్నాడు.

ఆమీాద ప్రభుత్వంవుంది. ఈ అన్నితరహాల్లోనూ వున్న అందరూకూడా మానవులే. అయితే ఒకళ్ళకొకళ్లు యెందుకు భయపడాలి! ఒకళ్ళ పచ్చకు ఒకళ్ళు యెందుకు ఓర్వలేక పోవాలి! ఒకళ్ళ ఆనందానికి ఒకళ్లు యెందుకు అడ్డు రావాలి!

చిన్నరైతును కావడంతో నేను అతడికి యజమాని నయాను! అయితే—అతడు పాడుకోగూడదూ? అణిగిమణిగి, భూమికి జానెడు లోతుని కుంగిపోయివుండాలా! యెవళ్ళండీ ఈ దుశ్శాసనాన్ని కల్పించిన మహానుభావులు!!

ఎవరు విధిని వారు నెరవేర్చుకుంటూ పోతున్నప్పుడు-యెవరికి యెవరు భయపడేదీ! యెందుకు భయపడేది!

అబ్బా—ఈ 'భయం' అనేది మానవసంఘాభివృద్ధికి నిరోధకం అవుతున్నది! ఈ 'భయం' అనేదే చురుకుపాలుకు పిరికిముందు! ఇదే ఇంతటి భారతదేశాన్ని విదేశీయుల చేతులకు అప్పగించివేసిన పిశాచి!!

భయం చావాలి. పరాక్రమం పుట్టాలి. అప్పుడుగాని-

ఇలా అనుకొంటూ—అప్పుడే కోసిన దోసపిండెలు ఒక్కొక్కటే కాజేస్తూ—బైలుదేరాను. అప్పటికి నాగలిని దూళ్ళపాకలో పడేసి—ఇంటికి పోతున్నాడు, నరుసు.

'నరుసూ! పంటమూాన యెవరు వేశారు!' అన్నాను అతడిని పిల్చి.

'మా యెంకిది వేసిందండి' అన్నాడు.

'యెంకి—అన్నమాట చాలక పైగా ఒక 'ది' కూడా చేర్చావూ! యెంకమ్మ అంటే నీ సొమ్మేంపోతుంది! నీ భార్యని

నువ్వే గౌరవించుకోకపోతే పరాయివాళ్ళు గౌరవిస్తారా!' అన్నాను.

ఇంకా కొంచెం విపులంగా చెప్పాలని 'మనం గౌరవింపబడాలంటే, ముందు మనవాళ్ళని మనం గౌరవించుకోవాలి. దేశానికి గౌరవం రావాలంటే, ముందు దేశీయులికి గౌరవం వుండాలి... ...

'దేశమంటే మన్నుకాదోయ్
దేశమంటే మనుషులోయ్'

అన్నట్టు, దేశం సకలసంపదలతో తులతూగుతూ వున్నా — దేశంలోని మనుషులికి గౌరవంలేనినాడు ఆ దేశానికే గౌరవంలేదు. ఇదే ఇప్పుడు మన తెలుగుదేశానికి పట్టిన దుస్థితి!

'తెలుగుభూమి చాల సారవంతమైంది. బంగారం పండుతుంది. కాని తెలుగువాళ్ళంటే దేశంలో గౌరవం లేదు. కారణం!- మనల్ని మనం గౌరవించుకోకపోవడమే.

'గౌరవం వచ్చేది మనిషినిబట్టి కాని హోదానుబట్టి కాదు. ధనికుడుకాబట్టి గౌరవంగా చూడాలనీ — కూలీగాబట్టి హీనంగాచూడాలనీ ఏ స్మృతిలోనూలేదు. అదే నిజమయితే, దౌర్జన్యం అన్నమాట.'

ఈ మాటల ధోరణిలో మేము చాలాదూరం పోయాం. మా పొలందాటి, సరుసు యిల్లుదాటి, కూడా పోయాం. అక్కడ రామాలయం అరుగుమీద పదిమంది కూర్చుని కథలు చెప్పుకొంటున్నారు.

నన్నుచూడగానే రమ్మన్నారు. 'వస్తానుగాని కథ సాగనీయండి' అన్నాను.

'మా కథలకేం లెండి. పనీ...పాటూ లేని కథలు' అన్నాడు అందులో ఒక పిల్లరైతు.

నిజంగా పనీపాటూ లేనికథలే సుమా. ఊకుపు లైపోయాయి. ఇక రైతుకి ఏమీ పనివుండదు. పిల్లరైతులకీ-కూలీలకీ తిండికి చాలా ఇబ్బందిగా వుంటుంది. చేదామంటే పనులు కనపడవు. డబ్బు దొరికేసూత్రం కనబడదు. ఏమీ తోచక ఈ నాలుగు నెలలూ దరిద్ర దేవత కడుపులో గురకలు పెడుతూ వుంటారు.

'ఇంకానయం. మీరు కథలైనా చెప్పుకొంటున్నారు. ఎందుకూ కాని పేకాటల్తోనూ గాలిపటాల్ని ఎగరవేయడం తోనూ-బీచీ షికార్లతోనూ—డాన్సింగులతోనూ—కాలం వృధాపుచ్చుతూవుండే పట్నవాసుల జీవితంచూస్తే—ఛీ! ఛీక్ !!—'

'కాని వాళ్ళకీ—మనకీ ఒక్క విషయంమాత్రం తేడా వుంది. వాళ్ళకి కష్టంలేకుండానే డబ్బువస్తుంది. మనకు రెక్కలు ముక్కలు కొట్టుకొన్నా డబ్బురాదు. ఈ కీలకమే మనం కనిపెట్టాలి.' అన్నాను.

అప్పుడింకోరైతు అన్నాడు: 'మీరు పట్నంవాళ్ళ దాకా పోయారు. మన పల్లెటూళ్ళనే వుంటూ—ఏమీ కష్టంలేకుండానే—రైతుల్ని పీల్చి పిప్పిచేస్తూ, వేలూ—లక్షలూ గడించుకుంటున్న ఈ భూస్వాముల మాట చెప్ప రేం ?'

ఇంకోరైతు:—'మనదేశంలో కేవలం తిండిలేక వేనకు వేలు చచ్చిపోతూవుంటే ఈ విషయాన్నిగురించి కొంచె

మైనా ఆలోచించకండా 'పాపం-చైనావాళ్ళు చచ్చిపోతు న్నారు, రామ రామ! స్పెయిన్ ప్రభుత్వం పడిపోతున్నది' అంటూ కన్నీరుపెట్టుకొనే మన పిల్లనాయకుల మాటల్లాగనే వున్నాయి మీ కబుర్లనూ! బస్తీ వాసన బాగా తగిలిందా ఏమిటండో?'

నేను అడ్డంగా మాడాను. ఏం చేసేది? మొన్న మొన్నటివరకూ గ్రామీణులు ప్రపంచం ఏమిటో ఎరగ కుండా నూతిలో కప్పలలాగ వున్నారు. తమ పనేమిటో తామేమిటో అంతే! కర్మసిద్ధాంతాన్ని నమ్ముకొని కలిగిన దానితో తృప్తిపడి వుండేవాళ్ళు.

కాని ఇప్పుడు బాగా తెలివిమీరిపోయారు. ఏ శక్తి ప్రపంచానికంతకీ జీవనమైందో, ఆ శక్తికి తామే దోహద కర్తలమనీ, అట్టి తమశక్తి లోకకళ్యాణంకోసం కాక కొంత మంది స్వార్థపరుల స్వాభివృద్ధికి మాత్రమే వ్యర్థపరుపబడుతూ వుందనీ, రైతులూ, కూలీలూ ఇప్పుడు గ్రహించారు.

అప్పుడు నే నన్నాను:

'నన్ను మీరు అలా అనగూడదు. బస్తీవాసన తగ లడమంటే పైత్యం తలకెక్కడ మన్నమాట. నాకు అలాటి పైత్యమే ఎక్కివుంటే ఆ గిరాకీల్లో, ఆ షోకుల్లో మునిగిపోయి మళ్ళీ మీమొహం చూచివుందునా? ఇంతకీ నేను చేసిన దోషమేమిటి? ఇక్కడి మన జీవితవిధానంతో ఇక్కడి భూస్వాముల జీవితవిధానాన్నే తేడాతీయక, పట్నస్థుల జీవిత విధానాన్ని తేడా తీయడమేకదా?'

'అచ్చే వట్టినే అలా అన్నానండీ. పట్నాల్లో ప్రజలు ఎలా వుంటారో తెలిసికోవడంకూడా మన విధి' అన్నాడా రైతు.

'ఔను. నన్నడిగితే—తిన తిండీ, నిలవ నీడా, కట్ట బట్టా, ఇవే వుంటే–గ్రామజీవితంముందు పట్నజీవితం నిజంగా లెఖ్ఖకొస్తుందా ?'

'ఆ మూడింటి కోసమే జీవితకాలమంతా కష్టపడి ఏడ వాలి గద మనం' అన్నాడు ఇంకోరైతు.

'ఎంతకాలం ఏడుస్తాం ? ఏడవడానికే పుట్టామా ? ఈ ప్రపంచంలో కొందరు సుఖపడడానికీ–కొందరు కష్టపడడానికీ అని చెప్పి వేరేవేరే పుట్టారా? సృష్టిలో లేదు ఈ పక్షపాతం. సంఘంలో కలిగింది. దీన్ని సంస్కరించుకొని సంఘాన్ని పున ర్నిర్మాణం చేయాలి' అన్నాడు ఒక కూలీసంఘపు మేస్త్రీ.

'సంఘ పునర్నిర్మాణం' అనే విషయాన్ని గురించి నన్ను కొన్ని ఉపన్యాసాలివ్వమన్నారు.

'ఉపన్యాసాల యుగం దాటిపోయింది. కబుర్లతో కార్యాలు సాధించే రోజులు దాటిపోయాయి. అయినా ఉప న్యాసాలు కావలిస్తే కావలసినన్ని ఇస్తాను. వాటి నన్నిటినీ కార్యరూపంలో పెట్టి ఉపయోగానికి తీసుకురావాలి. లేక పోతే లాభంలేదు' అని అంటూ 'నరుసూ! నువ్వెళ్ళిపో. చీకటి పడ్తది' అన్నాను.

నరుసు వెళ్ళిపోయాడు. నే నక్కడేకూర్చుని 'కథ రాసేయండి. మధ్యలోనే విడిచిపెడితే మొండితేలు కుడు తుంది' అన్నాను.

'ఈ పిచ్చినమ్మకాలు మీాకూ వున్నాయాా?' అని అడిగాడు ఒకతడు.

'నాకు లేవు. కాని మీాకు వున్నాయి కాదా' అన్నాను.

'అబ్బే, మాకథ అంత గొప్ప కథ కాదు. పూర్వం కూలీలూ, రైతులూ ఒక్క తల్లిబిడ్డలే అని కథ చెప్పుకుంటు న్నాం' అన్నాడు ఆ కథకుడు.

'ఒక్క తల్లిబిడ్డలు ఎలాగయాారు?' అన్నాను.

'ఒక తల్లికి ఇద్దరు కొమాాళ్ళు వుండేవారట.'

'ఊఁ...'

అందు పెద్దవాడుసోమరి, చిన్నవాడుచురుకైనవాడు.

'ఊఁ...'

"చిన్నవాడి చురుకుదనానికి మెచ్చి - అతడే తన మాానవసృష్టి కంతటికీ ఆధారభూతుడు కాగలడని గ్రహించి-భగవంతుడు అతడికి ఒక 'నాగలి' ఇచ్చాడట."

'నాగలితో సేద్యంచేసి ప్రపంచాన్ని పోషించుమని కాబోలు' అన్నాను, నేను.

'కాని ఇప్పుడు మరనాగళ్లు వస్తున్నాయి చూాచాారా?' అన్నాడు ఇంకొకతను.

'మరనాగళ్లైనా-అమరనాగళ్లైనా-అసలు నాగళ్లే కాదా! ఈ దేశంలో అయినా, మరేదేశంలో అయినా, భూమి దున్నక పండదుగదా?' అన్నాను.

'ఆనాగలిని సంతోషంతో తెచ్చుకుంటూా వున్నాడట ఆ కుర్రవాడు. ఆ మధ్యలోకి అన్నగారు ఎదురుపడ్డాడట-'

'ఊఁ...'

"తమ్ముడూ! నేను దేవుడిదగ్గిరికి వెళ్లలేకుండా వున్నాను. నీకు పుణ్యముంటుంది. ఈ నాగలి నాకిచ్చేసి-ఇంకొకటి అడిగి తెచ్చుకో-' అని బ్రతిమాలాడాడట.'"

'ఇచ్చేశాడా?'

'ఇవ్వక ఏమిచేస్తాడు? జాలిగుండె కలవాడు.'

'ఊఁ...'

'ఇచ్చేసి-భగవంతుడి దగ్గరికి మళ్ళీ వెళ్ళి ఎదురుగా నిల్చున్నాడట.'

"'మళ్లీ వచ్చావేమిరా? నీనాగలి ఏమిచేసుకొన్నావు?' అని అడిగాడట భగవంతుడు."

'ఊఁ...'

"'నా నాగలి మా అన్నకిచ్చానండి. నాకింకొకటి దయ చెయ్యండి' అన్నాడట-పాపం అతడు."

అప్పుడు భగవంతుడు ఉగ్రుడై 'ఓరి మూర్ఖుడా! ఇంకొకళ్ళకి దానం చెయ్యమనే ఇచ్చానా నీకు? నీ తెలివి తక్కువకి ఫలితంగా నీ యన్నకి పాలేరుతనం చేసుకొని-- బ్రతుకు. వెళ్ళు-పో-'అని గద్దించాడట."

'పాపం నిర్భాగ్యుడు.'

'ఆ నిర్భాగ్యుడే కూలీ అయినాడు. ఆ సోమరిపోతు అన్నగారే రైతు అయినాడు. ఆ రైతు తమ్ముడుతనకు చేసిన మేలు మరచిపోయి కూలిఅయినా సరిగ్గా ఈయకుండా హింస పెట్టేవాడు. ఆ తమ్ముడి సంతతివారే ఇప్పటి కూలీలు,

ఆ అన్నసంతతివారే ఈ రైతులు. అందరూ అన్నదమ్ముల బిడ్డలే. కాని రైతులు కూలీలను హింసపెడుతూ వుంటారు!

'కూలీలు, తెలివి తక్కువవల్ల యీ దుస్థితిని తెచ్చుకున్నారు. కనుక విరుగుడుగా తెలివితేటలవల్లనే ఈశాపాన్ని పోగొట్టుకోవాలి' అన్నాడు మా కూలీసంఘపు మేస్త్రీ.

సఖా! కథ వింటివా? నీ పత్రికలలోని కథలు ఎన్ని వందలయితే ఇలాంటికథ ఒక్కదానికి సాటి అవుతవి? సంఘంలో, వాఙ్మయంలో, కథల్లో, జీవంవుంది అంటే ఆజీవం గ్రామాల్లోనేవుంది. మా గ్రామాలు సహజసౌందర్య మధురాలైన పుష్పాలు, మీ పట్నాలు కృత్రిమపు రంగు రంగుల కాగితపు పువ్వులు.

అప్పటికి చాలా చీకటైపోయింది. రామాలయానికి భార్యలు వచ్చి వారివారి భర్తలను భోజనాలకు పిలుచుకు పోయారు. నేనూ లేచిపోయాను. ఇంటికి పోయేదార్లో ఇలా తోటగట్లమీద పాటలు పాడుకొంటూ పాలేరు కుర్రాళ్ళు ఖామందుల ఇళ్ళదగ్గరనుంచి కొంపలకు పోతున్నారు.

ఖామందుపొలములో సోమ పండింది,
పాలేరు గుడిసెలో బాల నవ్వింది,
తెలుగుతోటల్లోన తేనె కారిందీ
తల్లిచేతుల్లోన తనివి తీరిందీ.

........................................

ఇంటిచుట్టూ తోట యేపుచూపింది,
చేలనిండా పంట చెలువారుతుంది,

కాని మాయిళ్ళలో గంజైన లేదూ,
అమ్మలా ఆకళ్ళు ఆరనేలేదూ.

.... .... .... .... .... .... .... .... ....

పంట బాగాపండు భాగ్యాలతల్లీ!
పాలేళ్ళ ఆకళ్ళు బాపుమా తల్లీ!
కూడులేనట్టి మా గుడిసెలే తల్లీ!
బంగారుటిండ్లుగా పాలింపు తల్లీ!

★

ప్రియ మిత్రమా!

దసరావచ్చింది. నవరాత్రులు ప్రారంభమైనాయి. బలే జోరుగావుంది... ఉత్సవాల సంరంభం.

భారతదేశానికంతటికీ ఇది గొప్ప పండగ. డబ్బులేని మా గ్రామాలలోకంటే, డబ్బు మురుగుతూ వుండే మీ పట్నాల్లో ఎక్కువ దర్జాగానూ, దుబారాగానూ వుంటాయి ఉత్సవాలు.

బసంగిచేలు కోతకొచ్చాయి. వర్షాలు పడుతున్నాయి. మురుగుడువచ్చి చేలు ముంచుతూంది. నీరంతా విడగొట్టడానికి రాత్రి చాల రాత్రివరకూ పొలంలోనే జాగారం చేశాను.

'ఆంధ్రరాజ్యము మేము
ఆడుకోవాలి
ఆంధ్రతేజము మమ్ము
ఆలముకోవాలి

విజయమ్ము చేకూర్చు
వీరాధి దేవతా!
శుభములు దయచేయు
శుభ్రకాళీశ్వరీ!'

అంటూ మా చెల్లెలు పాడుతూంది.

'చేమంతిపూలో — చేమంతి పూలో—' అంటూ వీధిలో కేకలువేస్తున్నారు పువ్వులు. అమ్ముకొనేవాళ్ళు. ఆ కేకలు విని మేల్కొన్నాను నేను. అప్పుడే పొద్దు చరచరా పొడుచుకొచ్చేస్తోంది.

అరుగుమీద నిల్చున్నాను. పూలగంప అరుగుమీద పెట్టి—

'చేమంతిపూలండీ, పట్నానివి' అన్నా డతడు.

ఎంత దుస్థితిపట్టింది మా గ్రామాలికి! ఏమి భూకంపాలు పుట్టాయి మా గ్రామసీమల్లో! ఏమి ప్రళయంవచ్చింది మా గ్రామసౌభాగ్యానికి!

అయ్యో!

మా జనపదాలు జారిపోలేదే—మా పొలాలు పూడిపోలేదే—మా తోటలు సీటగలియలేదే—మా దొడ్లు దొర్లిపోలేదే.

మా పచ్చదనం భస్మమై పోలేదే — మా గ్రామ సౌందర్యం ధూమం కాలేదే. మా పల్లెటూళ్ళ కొచ్చి — పట్నాలు పువ్వు లమ్మడమా?

సిగ్గు-సిగ్గు. వాసి—వాసనాలేని పువ్వులమీాద వాసన రంగు పౌడర్లు చల్లి తెచ్చిన పువ్వులు, ఘుమఘుమలాడే మా

గృహారామ పుష్పాలమీద దిగదుడుపుకయినా పనికిరాని పువ్వులు –

మా గ్రామాలలో అమ్మడమా? మా గ్రామవాసులు కొనడమా? అయ్యో! ఆకాశం పెరేలు మంది, భూమి పళేలు మంది భగ్గుమంది నా వొళ్ళు.

డబ్బు దండుకొనే పట్నవాసులకు సిగ్గేమిటి? సంసారాలు చక్కబెట్టుకొనే గ్రామీణులకు వుండొద్దా బుద్ధి?

ఏమైనా నాలుగుడబ్బు లుంటే; పట్నం పువ్వులికీ – పట్నం కాఫీలకీ – పట్నం ముక్కుపొడుములకీ – పట్నం పౌడర్లకీ; – పట్నం షోకులకే కాజేస్తారు.

పువ్వులు పట్నాలనుంచి రావలసిందే? కూరగాయలు పట్నాలనుంచి రావలసిందే? అపరదినుసులు పట్నాలనుంచి రావలసిందే?

ఎంత తగులబడిపోతూంది గ్రామసౌభాగ్యం! ఎంత సోమరులై—మొద్దులై పోతున్నారు గ్రామవాసులు!

తమకు కావలసిన—తమకు చేతనైన— అవసరాల్ని కూడా వారు ఉత్పత్తిచేసుకోకపోతే మరెందుకు? పట్నాలకు శాశ్వతంగా దాసులైపోతారా గ్రామీణులు?

మా చెల్లి పరుగునవచ్చి 'ఏవీ-పువ్వులు—చూపించు' అంది.

'ఎందుకు?' అన్నాను.

'వుట్టినే' అంది.

'చెళ్ !— ఈ దండంతా మా దొడ్లో ఒక్క పువ్వుకి చాలదు' అంది, వందపువ్వులుగుచ్చిన ఒక దండను ఎత్తి.

'అలా తిట్టగూడదు, పొమ్మను' అన్నాను.

అత డేదో గొణుక్కుంటూ పోయాడు.

'తిట్టడం కాదన్నా! పట్నం పువ్వులు— పట్నం పువ్వులు అంటూ చెత్తపువ్వులు తెస్తాడేం? ఈ కొనుక్కునే వాళ్ళకి మతుల్లేవ్వా?' అంటూ— నే చెప్పేది వినకుండానే ఇంట్లోకి పరుగెత్తిపోయింది.

ఎవరిది తప్పు? పట్నంవాళ్ళదా? పల్లెటివాళ్ళదా? తమదొడ్లో పూయించుకోగలిగే పువ్వులుకూడా డబ్బుపోసి కొనుక్కోవడమేనా?

మిత్రమా! చూస్తివా? పల్లెటూళ్ళు ఎంత పాడై పోయాయో. ఇదంతా మీ పట్నాల మహాత్మ్యమే. పట్న నాగరికతా వ్యామోహంలో పడిపోయి పల్లెటూళ్ళు తమ మహత్తర వ్యక్తిత్వాన్ని మరిచాయి.

నేను ఇలా ఆలోచించుకొంటూ నిల్చున్నాను, వూళ్లో చిన్న చిన్న భజనపార్టీలు బయలుదేరి గోదావరికి పోయి స్నానాదికృత్యాలు తీర్చుకొని వస్తున్నారు.

చాలామంది చేతుల్లో బమ్మికొమ్మలూ - అవీ - వున్నాయి. మంగళవాద్యాలతో వాటిని తీసుకుపోతున్నారు.

"అర్జునస్య ధనుర్ధారీ
రామస్య ప్రియదర్శనమ్"

మొదలైన మంత్రాలు మధ్యమధ్య వినిపిస్తున్నాయి.

ఇవే జమ్మిపూజలు. లేక ఆయుధ పూజలు.

ఈ పూజలు ఏనాడు పుట్టాయో నీ వెరుగుదువా ? అజ్ఞాతవాసం తర్వాత పాండవులు జమ్మిచెట్టుమీద దాచిన ఆయుధాల్ని తీసికొంటూ ఆయుధపూజ చేశారు. అప్పటి నుంచీ ఈ ఆయుధపూజలు పుట్టాయని ప్రతీతి.

రావణుని చంపిన తర్వాత అయోధ్యకువచ్చే ముందు శ్రీరాముడు శమీవృక్షపూజ చేశాడు. అప్పటి నుంచీ ఈ దసరా పుట్టిందని మరికొంద రంటారు.

అసలు ప్రారంభం ఏదైనా యుద్ధదేవత ఆరాధనయే ఈ పండగ. శమీవృక్షాన్ని పూజించడం అంటే అపరాజిత దేవిని పూజించడం. అపరాజితదేవి విజయానికి అధిదేవత.

అట్టి విజయోత్సవానికి — అట్టి యుద్ధదేవత అర్చనానికి—అట్టి ఆయుధపూజాదీక్షకు—నేడు ఎట్టిగతిపట్టింది ?

మీ పట్నంలో జరిగే నవరాత్రిఉత్సవాలకి ఒకసారి వెళ్ళి చూడు.

మిఠాయిగుడ్లూ, ముంతకొప్పులూ, బొంత రొమ్ములూ, అసహ్యంగావుండే లక్కబొమ్మల గెంతులాటతో— వాటికి తీసిపోని భోగంమేళాల సీదర చిందులాటతో – వాటి వెనక ఉవ్విళ్ళూరుకొంటూ, సిగరెట్లు కాల్చుకొంటూ, కిళ్ళీరసం చొక్కాలమీద కార్చుకొంటూ, చెడదిరిగే పోకిళ్లాల చెర్లాటతో – క్రూరత్వాన్ని గాని, పరాక్రమాన్ని గాని, విజయోత్సవాన్ని గాని, ఏ విధంగానూ పుట్టించని సావిత్రీ చరిత్ర, నలోపాఖ్యానం మొదలైన హరికథాకాలక్షేపాలతో,

కోలాటాలతో

కొట్లాటలతో

ఇదా అపరాజితా దేవి పూజ? యుద్ధాల్లో విజయం చేకూర్చే మహాశ్శక్తిపూజ ఇదా?

మా గ్రామాల్లో ఈ వుత్సవాల్ని ఏనుగు సంబరాలు అంటారు, యుద్ధాల్లో ఏనుగుల మహాసంరంభాన్ని ఈపండగ సూచిస్తుందని గావును.

బాజాలతో ఏనుగుల్ని లొట్టిపిట్టల్ని ఊరేగిస్తారు. భజనలు చేస్తారు. ఈ భజనల్లోఅయినా వీరకీర్తనలు గాని, వీరకథనములుగాని, మచ్చుకైనా కనిపించవు. బాలింతకోపులతో ప్రొద్దులుపుచ్చుతారు.

ఇక ఈ మహాజనులు పూజించే ఆయుధాలు ఎట్టివో తెలుసా? అర్జునుడి ధనుర్బాణాలా? కాదు. భీముడి గదా? కాదు. శ్రీరాముడి దివ్యాస్త్రమా? కాదు. బాలవీరుడి పౌరుషమా? కాదు. పురుషోత్తముడి భుజాదండమా? కాదు. ఝాన్సీ లక్ష్మి ధైర్య సాహసాలా? కాదు.

పోనీ— తుపాకీలా? కాదు. ఫిరంగిగుండ్లా? కాదు. మరేమిటి?

కుమ్మరి కుండపెంకులు— మంగలి పొది— రైతు నాగలి—జమీందారు ఇనప్పెట్టె—ఉద్యోగి ఫైల్సుకట్టలు!

ఏమి ఆయుధాలు! ఏమి ఆయుధపూజలు!! ఇంతకి దిగింది మన ఆయుధపూజ!!!

సఖా! పూజించడానికి వీరులులేరా మనకు? స్మరించడానికి వీరచరిత్రలు లేవా? పాడుకోడానికి వీరగాథలు లేవా?

ఈ విషయంలో చూస్తే మా గ్రామాలకంటే మీ పట్నాలు సర్వభ్రష్టమైనాయి.

పల్నాటి వీరచరిత్ర - బొబ్బిలి యుద్ధగాథ, మరాటీ వీరకథనం మొదలైన వీరగానంవల్ల ఇంకా మా పల్లెటూళ్లు జీవనం నిలబెట్టుకొంటున్నాయి. పట్నాలకు అదీలేదు.

మొన్న మొన్న జరిగిన సిఫాయీ కలహం స్వాతంత్ర్యం కొరకు జరిగిన పోరాటంగా ఎంతమంది చిత్రించారు? ఎంత మంది కవులు ఆ పోరాటాన్ని గానంచేశారు? అదే మరో దేశంలో అయితే?-

చెప్పవచ్చే దేమంటే మనపూజలూ, మనపండగలూ, మన ఆచారవ్యవహారాలూ, అర్థం తెలీకుండా, అర్థంలేకుండా, అనుసరించబడుతున్నాయి.

మన దేశంలో వీర్యం నశించింది. పౌరుషం పరుల పాలయింది. శక్తి చల్లారిపోయింది. బడాయి, షోకు, ఈ రెండూ మనకు దాపరించాయి. అవి మీ పట్నాల్లోంచి మా పల్లెలలోకి పాకిపోయాయి.

ఈ ఆలోచనా ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్న సమయంలో ప్రక్కవీధినుంచి ఒక పాట వినిపించింది నాకు.

"పావులా బేడైతె పట్టేదిలేదూ
అర్థరూపాయైతె అంటేదిలేదూ
రూపాయిఅయితేను చెల్లుబడికాదూ
రెండురూపాయిలూ రొక్కంబు మాకూ
అయ్యవారల కిందు ఆయిదువరహాల్లూ

బాగుగా మాకింతు పప్పుబెల్లాలూ
జయా విజయీభవ, దిగ్విజయీభవ."

దసరారోజంతా ఉత్సాహాన్నీ, ఉత్సవాన్నీ కలిగించేది ఈ బడిపిల్లలే.

తమ రంగురంగుల గిలకలబద్దలతో — కనపడ్డవారిపైనెల్లా బుక్కా కొట్టుకుంటూ వీధులలో వరసగా నడిచిపోయే ఆ బాలబాలికల్ని చూస్తే—భారతయుద్ధం జ్ఞాపకానికి వస్తూవుంటుంది.

నాటి ధనుస్సులూ, బాణాలూ, అస్త్రశస్త్రాలూ — నేటికి గిలకబద్దలుగానూ, బుక్కా గొట్టాలుగానూ, బుక్కాగానూ తయారయ్యాయి. నాటి యుద్ధగీతాలు నేటికి ఉపాధ్యాయుల బహుమతుల పాటలుగా మారినాయి. నాటి పరాక్రమం నేటికి పిల్లలమీదా, వృద్ధులమీదా బుక్కా కొట్టడంలో చూపబడుతోంది. ఎంత పతనం !

పోనీ - ఈమాత్రపు జ్ఞాపకాన్నైనా వుంచుకొని, పూర్వపు గాథలు నెమరుకు తెచ్చుకొని, కాస్త నవజీవనం పొందుదామంటే, ఈ 'గిలకలు పట్టించడం' కూడా ఉపాధ్యాయుల అధికారంలో లేదిప్పుడు. ఈ బడిపిల్లల వేడుక ఉత్సవాన్ని ప్రభుత్వంవారు అరికట్టేశారు. మరే అవినీతి - అఘాయిత్యపు ఆచారాల్నీ అరికట్టలేకపోయినా, ప్రభుత్వం ఇలాంటి ఉపయోగమయిన ఉత్సవాల్ని మాత్రం అరికడుతుంది.

దసరా దండయాత్ర మాయింటిమీదకుకూడా వచ్చే లాగుంది. నేను కూడా బుక్కా బాణాలకు గురిఅయ్యేలా గున్నాను. కాస్త కాచుకోవాలి. సెలవు.

★

ప్రియసఖా!

నీ లేఖ అందింది. పట్నం జీవితం యెలా వుంటుందో అందులో వర్ణించావు. పల్లెటూరిజీవితాన్ని చిత్రిస్తూ ఉత్తరం వ్రాయమన్నావు.

నీది ఉత్తమమైన వాంఛ. ఒకచోట జీవితవిధానంతో మరొకచోటి జీవితవిధానాన్ని నిత్యమూ తెలిసికొంటూ వుండాలి. మంచిచెడ్డలు హెచ్చుతగ్గులు, ఏమైనావుంటే సరి చేసికోవాలి. ఈ వాంఛ నీకు కలిగినందుకు చాలా అభినందిస్తూ వున్నాను.

నీ పట్నజీవితానికీ—నా పల్లెటూరిజీవితానికీ పరస్పర విరుద్ధంగావుంటుంది. నీ పట్నజీవితం సౌఖ్యమయంఅయితే— నా గ్రామజీవితం కష్టమయం. నీ పట్నవాసం ఆనందకరం అయితే నా గ్రామవాసం దుఃఖకరం.

నీ ట్రాంబళ్ళు, నీ మోటారుటాక్సీలు, నీ ఎలక్ట్రిక్ ట్రైనులు, నీ కాఫీహోటళ్ళు, నీ సినీమాలు, నీ రేడియో సంగీతాలు, నీ హాస్పిటల్ గొడవలు, నీ జీవితాన్ని వాయు వేగ మనోవేగాలతో ఎక్కడికో తీసుకొనిపోతూవున్నట్లు అని పిస్తూంది నీకు. కాని—

నా రెండెడ్లబళ్ళూ, నా సవారీలూ, నా నాగళ్ళూ, నా మోటలూ, నా గడ్డపారలూ, నా వ్రాఘ్వలూ, నా కలుపుతీతలూ, నా కుప్పనూర్పులూ, నా పొలిపాటలూ, నా చెమ్మటబొట్లూ, నా పూరిగుడిసెలూ, నన్ను ఎక్కడి వాణ్ణి అక్కడే వుంచి క్రుళ్ళబెట్టి పాతేస్తూవున్నట్లు తోస్తూ వుంది నాకు. చూచావా మన ఇద్దరి జీవితవిధానాలకీ మధ్యను వున్న అంతరం?

నా జీవితవిధానాన్ని గురించి వ్రాయడమంటే పల్లె టూళ్ళ జీవితవిధానాన్ని గురించి వ్రాయడ మన్నమాట. అంటే కన్నీళ్ళు కార్చడమన్నమాట. అంటే హృదయాన్ని చీల్చుకోవడం అన్నమాట. పల్లెటూళ్ళు ఎంతెంత ప్రత్యక్ష నరకాన్ని అనుభవిస్తూ వున్నారో విద్యుద్దీపాలూ, విద్యు త్పంకాలూ ఒప్పారుతూవున్న మేడలలో హాయిగా సుఖించే నీకు ఏమి తెలుస్తుంది.

గ్రామజీవితం నీకు అర్థం కావాలంటే మా ఇంటికి ఒక సారి రా. ఈ పూరిగుడిసెలో ఈ డొక్కునారత్రాడు మంచం మీద ఒకరాత్రి పండుకో. ఈ పచ్చిమిరపకాయ ముక్కను నంజికొంటూ ఈ అంబలి కాస్త త్రాగు. ఈ కిరసనాయిల్ బుడ్డి దీపందగ్గర ఈ కూలీమనిషికి ఒక వుత్తరం వ్రాసిపెట్టు.

రంగంలోవున్న తన భర్తకు వుత్తరం వ్రాయించు కోడానికి ఇప్పుడే వచ్చింది ఒక కూలీమనిషి. ఇప్పుడు రాత్రి పదిగంటలు. ఎనిమిదిగంటలకి వచ్చింది పొలంనుంచి, మానెడు ధాన్యం వుంటే-దంచి—గంజికాచుకొని-త్రాగి—

ఇప్పుడు వచ్చింది నా దగ్గరకు వుత్తరం వ్రాయించుకోడానికి. నీ కళ్ళల్లో ఏమైనా కన్నీళ్ళు వుంటే ఇప్పుడు రాల్చు.

'...వూడుపులై పోయాయి. ఏమీ పన్లులేవు, గడ్డి కోసి అమ్ముకొంటున్నాను. రోజూ అణా–బేడా–వస్తూంది... మీా బాబుకు నల్లమందుకే సరిపోవడంలేదు. ఉన్న వొక్క–ముక్క–పుడకా ఆరుఅణాలికి తాకట్టు పెట్టేశాను...రంగంలో దెబ్బలాటలంట, వెంటనే దేశం వచ్చేయవలసింది...తర్వాత దేవుడేవున్నాడు... ఇల్లు ఒక ప్రక్క–కూలిపోయింది...నిట్రాడు మీాదపడి లేగదూడ చచ్చిపోయింది ... రెండో ప్రక్క–నాలుగు ఆకులు వొడ్డుకొని వుంటున్నాం...'

ఈ వుత్తరం వ్రాసినంతసేపూ వెంకమ్మ ఏడుస్తూనే వుంది. ఈ శాస్త్రముక్కా– వ్రాయడానికి నాకు ఒకగంటసేపు పట్టింది.

ఒకవైపున భర్తమీాది బెంగ–ఒకవైపుని దరిద్రదేవతతో కొట్లాట! కడుపు తరుక్కు–పోతోంది.

'అమ్మా! ఎందుకలా ఏడుస్తావు? ఏడ్చి ఏమిలాభం? రంగంలో దెబ్బలాటలు చల్లారిపోయేయి. నీ భర్తకొచ్చిన ఏమీా ఫర్వాలేదు. ఇక దరిద్రమంటావా? ఏడిస్తే ధనం వస్తుందా?...' అంటూ ఓదార్చబోయాను.

వెంకమ్మ ఏమీా మాట్లాడలేదు. కొంచెంసేపటికి దుఃఖం ఆపుకొని అన్నది– 'అన్నయ్యగారూ! ఆడవాళ్ళను అవమానించి–కంచంలోని అన్నాన్ని కాలదన్నే రాక్షసులికి ఏమన్నా శాస్త్రివుందా?' అని.

'వుంది వుంది. ముమ్మాటికీ వుంది. ఇప్పుడు కాకపోతే- మరెప్పటికైనా వున్నది. ఏం! నిన్నెవరైనా అవమానించారా?' అని అడిగాను.

'నా భర్త దేశంలోవుంటే నాకిన్నిపాట్లు వుండకపోనుగదా. నేను ప్రొద్దుట గడ్డికిపోయాను పొలంలోకి. ఆ పొలం ఏ రైతుదో నాకు తెలీదు. గట్టున కూర్చుని గడ్డి కోసుకుంటున్నాను.

పెనుభూతంలాగ వచ్చిపడ్డాడు, ఎక్కడినుంచో. అతగాడెవరో నాకు తెలీదు. నోటికిరాని బండబూతులు తిట్టాడు- కొడవలి లాక్కొన్నాడు-గడ్డి బుట్టను పరపరా చింపేశాడు- గడ్డిని చేలల్లోకి విరజిమ్మేశాడు. బ్రతిమలాడాను-వేడిచాను, మొత్తుకున్నాను. పాదాలమీద పడ్డానుకాని...'

మిత్రమా! కడుపు కరిగించే ఇలాంటి దృశ్యాలు మా గ్రామాలలో ఎప్పుడూ పరిపాటే. ఇలాంటివి ఎన్నో చూచాను. చూచి చూచి నా గుండె కరుడు కట్టుకుపోయింది. దరిద్ర దేవత-అవమాన దేవత-కష్ట దేవత-దుఃఖ దేవత— యీ దేవతలంతా నిర్భాగ్య కార్మిక సంఘాన్నే పట్టుకొని పీడించుకు తింటున్నవి. ఇప్పుడైతే మాత్రం కన్నీరు రాల్చడం తప్ప నేను చేయగలిగిం దేముంది?

'వెంకమ్మా! కష్టే ఫలే-అన్నమాట వట్టిది కాదు. ఏనాటికైనాసరే-కష్టం ఫలించి తీరుతుంది. ఎన్నోవందల సంవత్సరాలనుంచి మన కూలీజాతి కష్టపడుతోంది. సుఖపడే కాలం రాకపోదు. వెంటనే రాకపోవచ్చును. ఈ తరంలో రాకపోవచ్చును. వచ్చేతరంలో రాకపోవచ్చును. కాని

రాకనేపోదు. మనం కష్టాలు పడ్డాము. పడుతున్నాము. కష్టాలికి తగిన ఫలం - ఆనందం అనుభవించడంలేదే అని మనం ఇప్పుడు విచారించగూడదు. ముందు ముందు మనజాతి అంతా సుఖపడడానికి తగిన పునాదుల్ని మనం వేసి_పోతున్నాంసుమా అనేదే మనం పొందవలసినసంతృప్తి. ఆ సంతృప్తిలోనే మనకు సుఖం వుంది.

'ఈనాడు ఒక కూలీ కష్టపడిందంటే ముందుకాలంలో ఒక కూలీ సుఖపడుతుందన్నమాట. ఈనాడు ఒక కూలీ అవమానింపబడిందంటే వచ్చేకాలంలో ఒకామె మహాపతివ్రత కాబోతుందన్నమాట. ఈనాడు ఒక కూలీ అన్నంలేక ఆకటిచే అల్లాడిపోతూ చచ్చిపోయిందంటే ముందుకాలంలో ఒకకూలీ రాజ్యం ఏలుతుందన్నమాట. ఇప్పుడు కూలీలంతా దరిద్రులై గుడిసెల్లో కుమిలిపోతున్నారంటే ముందుయుగంలో కూలీలంతా సంపన్నులై చక్కని మేడల్లో సుఖిస్తారన్నమాట.

'కాని మనలో ఒక్కటిమాత్రం అవసరం. ఈ దీన స్థితికి విచారమూ ఉన్నతస్థితికి రావాలనే ఆసక్తి, పురుష ప్రయత్నమూ, ఇవి ఎంత మిక్కుటంగావుంటే అంతత్వరలో యీ కూలీల ఇప్పటి స్థితి మారి ఉన్నతస్థితి కలుగుతుంది. నీ అవమానాన్ని గురించి విచారించకు. ఇదొక్క లెక్క కాదు. ఇలాంటి అవమానాలు రోజుకు ఎంతమంది కూలీలు పొందడంలేదు?' అన్నాను.

నా మాటలు అర్థంచేసుకొన్నది, ఊరడిల్లింది వెంకిమ్మ.

'అన్నయ్యగారూ! మీరు చెప్పిందంతా నిజమే.

దేవుడేవుంటే- ఈ కూలీలకు ఇన్నికష్టాల్నీ-అవమానాల్నీ కలిగించేవాళ్ళకి...'

'ఆగు ఆగు. వెంకమ్మా! నీవు ఇతరుల్ని నిందించే కంటే నిన్నూ-నీజాతినీ దీవించుకోవడం మంచిది. ఏమంటావ్? ఒక భాగ్యవంతుణ్ణి నీ అధమస్థితికి తెచ్చేకంటే-నీవు ఒక భాగ్యవంతుడి స్థితికి వెళ్ళడం సంఘానికీ-దేశానికీ కూడ ఎంతో శ్రేయం!' అన్నాను. గుడ్లనీరు గుక్కుకొంటూ వెంకమ్మ వెళ్ళిపోయింది.

నీకు లేఖ వ్రాస్తూవుండగా జరిగినవిషయం ఇది. ఇదే వ్రాశాను. దీన్నిబట్టి నా గ్రామజీవిత విధానాన్ని ఊహించుకో.

గ్రామం ఎవరిది? నీ పట్నంలోవుండే గవర్నరు దను కున్నావా? లేక ప్రధానమంత్రి తాతసొమ్ము అనుకున్నావా? కాదు_కాదు. గ్రామం మాది. అంటే మా కూలీలది- మా రైతు బిడ్డలది!

'భారతభూమి సౌభాగ్యవంతమైంది' అంటే ఆ భూమి ఎవరిచెమట బిందువులతో పునీతమైందో ఎరుగుదువా? ఆ సౌభాగ్యమంతా ఎవరి కష్టఫలితమో తెలిసికొంటివా?

అట్టికూలీలు-రైతులూ-ఎంతెంతటి నష్టకష్టాలు అనుభవిస్తూన్నారో-వాళ్ళు బ్రతుకుతున్నది ఎలాంటి దీనపు బ్రతుకో ఎప్పుడైనా చూచావా?

మా గ్రామాలు మారాలి. దేశసేవ అంటే మీ పట్నంలో వంతెనలు కట్టించుకోవడం కాదు. మీ కార్పొరేషను బిల్డింగులకి మెరుగులు దిద్దుకోవడం కాదు. వేలూ

లక్షలూ పాలరాతి పాయిఖానాలకోసం కర్చుపెడతారే మీ పట్నంలో అదికాదు, దేశసేవ అంటే!

'తెల్లవారుజామునే లేచి పొలం పోవాలి' అని మా అయ్య కేకేస్తున్నాడు. కనక ఇప్పటి కీఉత్తరం ముగిస్తున్నాను. తక్కినవిషయాలు వచ్చే లేఖలో వ్రాస్తాను. సెలవు!

★

సుహృద్వరా !

“పిల్లికి పీతల మొలత్రాడు”అంటారు. అంటే ఏమిటో తెలుసా ?—

లేతగా వూడ్చిన పంపు మూనతిరిగిందో లేదో చూచి వద్దామని సాయంకాలం పొలం బయలుదేరాను. రోజంతా వర్షం కొట్టి కొట్టి అప్పుడే తెరిపి ఇచ్చింది.

తేలుకుట్టిన దొంగల్లాగ అప్పటిదాకా ఇళ్ళల్లో అణిగి మణిగివున్న పిల్లకాయలంతా ఎగబడ్డారు పొలాల్లోకి. అప్పటిదాకా పాకలలోనూ— పంచలలోనూ— కట్టివేసి వుంచిన పశువుల్ని విప్పి కంచెలికి తోలుతున్నారు పాలేళ్ళు.

ఆ దృశ్యాన్ని వొకసారి చూశావా? చాలా అందంగా వుంటుంది. విడీవిడనీ మేఘాలూ— వచ్చీరాని తుంపర్లూ— కాసీకాయని యెండా— మేసీమేయని పశువులూ— తిరిగీ తిరగని మనుష్యులూ.

నిండు భాద్రపదమాసం, బోదెలూ—కాల్వలూ— వుప్పుటేర్లూ— చెరువులూ— పొలాలూ— గట్లు మునిగి

పొర్లుతూవున్నై. ఏపు గుల్కుతూ సస్యాలు మనోహరంగా వున్నై.

కాలవల్లో ఈతలు కొట్టేవాళ్ళూ — చెరువులలో గేలాలు కాచేవాళ్లూ—బోదెలలో ఎదురెక్కే చేపలకోసం ఆరాటపడేవాళ్ళూ.

నేను ఒక చిన్న పిల్లకాలవదాటి చేలోకి పోయాను. కంది బెండచెట్లని మెల్లిమెల్లగా ఒత్తిగించుకొంటూ— చేల చుట్టూ తిరుగుతున్నాను.

ఇతింత హాయి —ఆహారం మా పల్లెటూళ్లు రాసులు రాసులుగా పంట పండేస్తున్నాయే! ఇంతకంటే మా కింకేం కావాలి?

ఏం కావాలి?— అంతా కావాలి. ప్రశాంతజీవనం, ప్రకృతి సౌందర్యం, ఇవి తప్ప—సమస్తమూ కావాలి.

పంటలు సమృద్ధిగా పండుతున్నాయి— కాని మాకు దక్కడంలేదు. ఫలాలు పండుతున్నాయి— అవి ఏమైపోతు న్నాయో!—

ఏమైపోతున్నాయి? మీ పట్నాలకు పోతున్నాయి. పండించేది మేము—అనుభవించేది మీరు. కష్టపడడం మా వంతు, దాని ఫలితం తినేయడం మీవంతు.

మేము జీవనాధారమైన అమృతాన్ని సేద్యం చేసి మీకు అందిస్తున్నాం. తిరిగి మీరు మాకు ఏమి ఇస్తున్నారు? ఎందుకూ పనికిరాని— పైగా జీవితాన్ని తికమకలుపెట్టే— వెదురుబద్దల విమానాలు, కాగితాల బుట్టలు, కాఫీకప్పులు

సిగరెట్లు, బీడీలు, మా నెత్తిమీద సుద్ది మా చేతుల్లో ఆడే నాలుగు రాళ్ళూ గుంజేస్తున్నారు. పట్నాలు పల్లెటూళ్ళకు చేస్తూన్న మేలు ఇదేకదూ ?

మా చక్కటిపంట అంతా తేలిగ్గా కాజేసుకోవడం—బూచి బూచి బొమ్మలు మా కంటగట్టడం.

'మీ రైతుల—కూలీల—మీద మేంఅధికార్లం 'అని దబాయించడం, పందలూ - వేలూ - జీతాలు తీసుకోటం, బస్తీల్లో కూర్చుని సర్వభోగాలూ అనుభవించడం.

ఎవళ్ళనోళ్లూ కొట్టక—ఎవళ్ళకడుపులూ మాడ్చక—ఎవళ్ళ ఇళ్ళూ దోచకపోతే— మీ వేషాలకూ - మీ విహారాలకూ - డబ్బు ఎక్కడినుంచి వస్తుంది ?

ఇదంతా మీ పట్నాల్ని నిందించడం కాదు. ఒకళ్ళని నిందించడం నా చేతనేకాదు. మా గ్రామాల్ని చూస్తూ కంట తడిపెట్టుకొంటున్నాను. మా అమాయికత్వానికీ - అల్పజ్ఞతకూ ఏడుస్తున్నాను. పట్నమే దేవలోకం అనీ - పట్నవాసులే దేవతలు అనీ - అనుకొనే ఈ గ్రామీణుల వెర్రిబాగులతనానికి సంతసిస్తున్నాను.

గ్రామ పునర్నిర్మాణం జరగాలి.—

"అలనాటి ఋషివాటికలనుండి పరతెంచు
అమ్నాయపూత గంగామృతమ్ము—"

ఇప్పుడు పట్నాల్లో మురికికాల్వలగుండా ప్రవహిస్తూంది. అలా పనికిరాదు. విజ్ఞాననిధులకు గ్రామవాటికలే ఆటపట్లు కావాలి. ఇది సాధించాలి.

ఈ లేఖ నీకు గ్రామపునర్నిర్మాణంమీద వ్రాయా లనుకున్నాను. ఒక్కటే కాదు. చాలా లేఖలు వ్రాయాలి, నీ అభిప్రాయాలుకూడా కోరదా మనుకొన్నాను.

ఇలా అనుకొంటూ చేలచుట్టూ తిరుగుతున్నాను. నా యీ ఆలోచనల్లో పడిపోయి ప్రపంచమే మరిచిపోయాను. పూర్తిగా యంత్రంలాగ తిరుగుతున్నానన్నమాటే గాని — చూచినా కనబడ్డంలేదు - చెవియొగ్గినా వినబడ్డంలేదు.

అంతలో ఒక కుర్రాడు కెవ్వున కేకేశాడు. ఉలిక్కి పడి చూచాను. స్వప్నంనుంచి మేలుకొన్నట్టుఅయింది. నా కళ్ళముందటినుంచి ఒక పెద్ద తెర తీసివేసినట్లయింది.

మిత్రమా! ఇలానే అనుభవిస్తున్నారు గ్రామవాటి కల ప్రశాంత సౌఖ్యజీవనం గ్రామవాసులు తమ నిరంతర కష్టాల్లోపడిపోయి దరిద్రదేవత నిశితదంష్ట్రికల్లో చిక్కుకొని, తమ దుస్థితికి దేవుణ్ణీ - దెయ్యాన్నీ - తిట్టిపోస్తూ - ఎందుకో ఒకందుకు ఎప్పుడూ ఆరాటపడుతూనేవుండే గ్రామీణులు సౌఖ్యం ఎలా అనుభవించగలరు? వారిచుట్టూ మిస మిస లాడుతూ తాండవించే ఈ ప్రకృతి సౌందర్యాన్ని వెలా గ్రహించుకోగలరు? ఎలా ఆనందించగలరు?

కష్టాలు పడేవాడికి ఎప్పుడూ తన కష్టాలమీదే వుంటుంది ధ్యాస. దుక్కి దున్నేవాడికి, నాగలి చేయడంలో వడ్రంగి చూపిన పనివాడితనం కనిపిస్తుందా? ఎద్దులకొమ్ముల వంపులలోవుండే ఆ సొగసుదనం అనుతుందా? తన వెల్ల గిత్తల నల్లతోకలు - నేటి కాలేజీ అమ్మాయిల కుచ్చుజడ లను జ్ఞప్తికి తెస్తవా? ఎక్కడి మాట?

కష్టపడేవాడికి కళ _ సౌందర్యం కనబడవు. ఒక దరి నుంచి వాడిశరీరం నలిగిపోతూవుండె - పేగులు కాలిపోతూ వుండె - ఆయాసం వస్తూవుండె - తల తిరిగిపోతూవుండె - అతడికి కళా, సౌందర్యమూనా కావలసింది ?

'ఏమబ్బాయ్ ! భేర మన్నావు ?' అన్నాను, ఆ కుర్రాళ్ళదగ్గిరకి పోయి. ఆతనిచేయి రక్తం కారుతోంది. పాపం ఆ కుర్రాడి చెక్కులమీద ఇంకా కన్నీటి చుక్కలు రాల్తూనేవున్నై. ఏం జరిగిందో చెప్పకుండానే అంతా అర్థ మాతూంది. ఆ ప్రక్కనే యేనాది కుర్రాళ్లు మండపీతల్ని పడుతున్నారు. పీతకన్నాలలో పేడనీళ్ళుపోసి- పీతలు బైటికి రావడంతోనే పట్టుకొంటున్నారు. పీతతో వేళాకోళం ఆడ బోతే వూరుకుంటుందా ? వేలు కత్తిరించింది.

అయినా ఆ కుర్రాడు దాన్ని వదల్లేదు. 'వదిలెయ్యి' అన్నాను. 'ఊహు' అని తల వూపాడు.

'మనం తినేవస్తువు ముందు మనల్ని కిరిస్తే నేం ?' అన్నాడు.

ఔను నిజమే. చాలా మంచి సిద్ధాంతం. ఈ సిద్ధాంతమే కదా మహాత్ముణ్ణి నడిపిస్తూంది ? మనం అనుభవింపబోయే సంపూర్ణ స్వరాజ్యం ముందు మనల్ని ఖైదులలోకి నెట్టి స్తే నేం - లాటీలతో కొట్టి స్తేనేం ? అణువు దగ్గిరనుంచి అంత రాళందాకా - పీతల్ని పట్టడంనుంచి పృథివిని పాలించడం దాకా - ఈ సిద్ధాంతం అక్షరాలా అనువర్తిస్తూంది !

కష్టాలు కలిగాయంటే అవి సుఖాలకి జేగంట లన్న మాట. దుఃఖంకలిగింది అంటే అది ఆనందానికి ప్రార్థనాదికం అన్నమాట.

ఆ చేలన్నీ వర్ష పుసీటితో మునిగిపోయివున్నై. మహా ప్రవాహంగా కొట్టుకుపోతున్నది. ఆ పైనుంచి ఒక ఉప్పుటేరు పారుతున్నది.

'అదంతా వర్షం సీరేనా!' అన్నాను.

'కాదు. పెద్ద కాలవ గండిపడింది. పాపం—సుబ్బారాయుడిగారి పొలం అంతా కొట్టుకుపోయింది' అన్నా డొకక్రాడు.

'మొన్న నేకదా పదివేలుపోసి గట్టు పోయించారు సర్కారువారు' అన్నాను.

'పదే కాదు, పదొందలు కాదు, పది రూపాయిలైనా దానికి ఖర్చుపెట్టలేదు' అని జవాబిచ్చాడు.

సఖా! ఇలా వున్నారు గ్రామదేవతలు. 'మన—రావుగారేకదా కంట్రాక్టరు? గ్రామసౌభాగ్యంకోసం ఎంతో భారం నెత్తిన బెట్టుకొని మోస్తున్నానని చాటుకొంటాడే ఆయన?'

'ఔనండి. ఆయన చాలా భారం మోస్తున్నాడు. ఆ మోత అంతా పిల్లికి పీతల మొలత్రాడు మోతలాంటిది.'

పిల్లికి పీతలమోత! యెంతమంది సంఘ సేవకులు ఇలాంటి మోతలు మోస్తున్నారో కొంచెం ఆలోచిస్తే గుండెలు (వున్నవాళ్ళకి) బద్దలైపోతాయి.

పిల్లికి పీతలమోత లాంటిది!

'అయితే ఆ డబ్బంతా అతడు తినేసినట్టేనా?' అన్నాను.

'ఏం - చేదా!' అన్నా డతడు.

'మీ రెందుకు వూరుకున్నారు!'

'వూరుకోక ఏం చేసేది? ఇత డొక్కడేనా? ఇలాంటి వాళ్ళెంతమంది ప్రజల డబ్బు తినేయడంలేదు? పైగా అతడు మంచి మోతుబరి. ఎదిరించి అడిగితే - అడిగినవాళ్ళకొంపలు గంగలో కలుస్తాయి.'

అన్యాయం జరుగుతుంటే కళ్ళారా చూస్తారు. చూస్తూ వూరుకొంటారు. ముందుకువచ్చే ధైర్యంలేదు. ఎదిరించే సాహసం లేదు. ఇలా వున్నాయి నేడు పల్లెటూళ్ళు. ఇట్టి దుస్థితిలో వున్నారు గ్రామవాసుల్లు. వీరా స్వరాజ్యం తెచ్చే యోధులు?

ఊహూ! —లాభంలేదు. గ్రామాలు - ఇప్పుడున్న స్థితిలో స్వాతంత్ర్య సమరానికి పనికిరావు. పునర్నిర్మాణం జరగాలి. ప్రజల్లో మిలిటరీ స్పిరిట్ వృద్ధిచేయాలి. మిలిటరీ డిసిప్లిన్ అలవరచాలి. అన్యాయాన్ని ప్రతిఘటించే ధైర్యం పెంపొందించాలి. అప్పుడుగాని ప్రజలు సైనికులు గాజాలరు.

ఇప్పుడు కాంగ్రెస్ పునర్నిర్మాణానికి పూనుకున్నది. అయితే దేశంలో కాంగ్రెస్‌బలం ఎంత? 3½ లక్షలు! 32 కోట్లమందిగల దేశంలో కాంగ్రెస్ బలం 3½ లక్షలు

మాత్రమే. కోటి కొకలక్ష అంటే నూటికి ఒక్కడు. తక్కిన నూ మంది మాటా?

ఇలాంటి పీతలమోత మోసే పిల్లులు చాలామంది సర్వత్రా వున్నారు. ఇలాంటి పిల్లుల్ని మనం లొంగదీయక పోతే రెచ్చిపోయి గ్రామాల్నే కాదు, పట్టణాల్నిగూడా నాశనం చేస్తారు

*

ప్రియసఖా!

వసంతకాలం వచ్చింది. కలకల్లాడుతూనే వున్నై మాపల్లె తోటలన్నీ. ప్రకృతి కాంత సౌందర్యం చిందుతూ నర్తిస్తూంది.

మోళ్ళు చిగిర్చినై, రాళ్ళు చెమర్చినై, వైకుంఠం లాగ నేత్రపర్వం చేస్తూనైవి, పైరుపొలాలు. కాని, మా బ్రతుకులు ఎలా వున్నైవి అనుకొన్నావు?

తరతరాలనుంచీ వస్తూన్న మా దరిద్రం దరిద్రంలాగే వుంది, పెనుభూతాల్లాగ మమ్మల్ని చుట్టుకొనివున్న మా కష్టా లు కష్టాల్లాగే వున్నైవి.

మా ఆకలిమంట మండుతూనే వుంది. మా ఏడ్పు గతి ఏడుస్తూనే వుంది.

శరీరానికి క్షయలాంటిది జీవితానికి పేదరికం. దీన్ని చైత్రకాలం చిగురింపజేయనూ లేదు; వర్షాకాలం ఉపశమింపజేయనూ గించనూ లేదు.

ఇక క్షీణించి పోవలసిందేనా మా జీవితాలు? ఈ కూలీ బ్రతుకుల్ని చిగిరింపచేసే కాలమే - అవకాశమే - లేదా లోకంలో?

విరబూసిన ఉద్యానాలలో విహరిస్తున్నారు, విదేశం సిల్కు వేషాలతో భాగ్యవంతులు ఒక ప్రక్క. మాసిన మొల దిరగని ముతక పీలికలతో, అభిమానాన్ని సిగ్గుపడుస్తూ పొలాల్లో కష్టిస్తున్నారు పేదకూలీలు మరో ప్రక్క.

మనోహరం అయిన మామిడితోపులో చల్లని ఒక కాసారంవొడ్డున కూర్చుని ఆటపాటలతో వినోదిస్తున్నారు భాగ్యవంతుల బిడ్డలు ఒక ప్రక్క. ఆ మండే ఎండలో తహ తహ లాడిపోతూ చినిగిన తువాళ్ళు నెత్తిపైని కప్పుకొని పశువుల్ని కాస్తున్నారు, కూలీబిడ్డలు మరో ప్రక్క.

ఈ రెండు ప్రక్కలికి మధ్యనొక గట్టువెంబడే పోతున్నాను నేను నిన్నసాయంకాలం. స్వతంత్రజీవనం కోసరం వెతుకుతున్నాను కానూ? ఆ వెతికే త్రోవల్లో ఇదొకటి.

స్వతంత్ర జీవనం-స్వతంత్ర జీవనం-అని పలవరిస్తూంది, నా గుండె.

నాలాంటి ఒక మానవుడికి నేను లొంగి ఎందుకు పని చేయాలి? వ్యర్థంగా నేను ఎందుకు ఈ దరిద్రం అనుభవించాలి? నాలాంటివాళ్ళు మేడలలోవుంటే, నేను ఎందుకు ఈ పూరి గుడిసెలలో పడవాలి? వాళ్ళు సుఖంగా వినోదిస్తూవుంటే, నేను ఎందుకు చెమ్మట వోడ్చి కృశించాలి?

ఈ ప్రక్క వినోదించే యీ భాగ్యవంతుల బిడ్డల్ని చూచి, ఆ ప్రక్కమాడే ఆ కూలీబిడ్డలికి ఏమైనా ఉద్దేశాలు

గలుగుతవా? తమ గతినిగూర్చి తాము ఆలోచించుకొంటారా? ఈ అసమత్వానికి కారణం యోచిస్తారా? పోనీ—ఆశ్చర్యం అయినా పడతారా?

ఇలా చింతించుకొంటూ సాగిపోతున్నాను నేను. ఈ అసమత్వానికి కంతకీ సంఘంచేస్తూన్న ద్రోహ్యం అనుకొంటు న్నాను-కారణం. రెండు ప్రక్కలా చూస్తున్నాను ఈర్ష్యతో.

ఇలావుంటే సంఘమంతా! ఈ పచ్చని సౌభాగ్యంతో అలరారుతూవుంటే!

ఆ ప్రక్కనవున్న ఎముకలగూడు ఆకారాలు పుష్టి చెంది ఈ ప్రక్కనవున్న సుందరస్వరూపాలుగా మారిపోతే! ఆ ఎర్రటి అకటికళ్లు ఈ శీతల తరళ నేత్రాలుగా అయిపోతే!

ఆ ఎండలలో ఎండే దీనగతి మాసిపోయి ఈ శీతల చ్ఛాయలలో సుఖంపొందే సుగతిగా పరిణమిస్తే!

ఎలావుండేది మానవసంఘం?

అలా మారడం సాధ్యమా?

కాలికి ఒక కందిమోడు తగిలి వ్రేలుపగిలింది. నేను పోతూవున్నది కందిమోళ్ళదారి అని అప్పుడు తెలిసింది నాకు, స్వప్నంలోంచి మేలుకున్నట్టు.

రక్తాన్ని పచ్చగడ్డికి తుడిచేసి రెండు గడ్డిఆకులు తుంచి కట్టు కట్టాను.

గాయం మండుతూంది కాని, నా హృదయం మంటని అది మించలేదు. అందుచేత నా ఆలోచనలలో నేను పడి కొట్టుకు పోతున్నాను.

ఆ కూలీపిల్లలు ఈ ధనవంతుల పిల్లల్ని చూస్తున్నారు. చూస్తూ 'అది వారి పూర్వపుణ్యఫలం; ఇది మన పూర్వ పాపఫలం' అనుకొంటూన్నట్లున్నారు. 'వీరిలాగ సౌఖ్యంఅను భవించగలం' అనేది వారి వుద్దేశంలోనే ఉండదు- 'అను భవించాలి' అనే ఆశకూడా వుండదు.

ఆ ఆశను వారికి కలిగిస్తే! తమ దీనస్థితికి అసంతృప్తి పడేలాగ వారినిచేస్తే! ఆ అసంతృప్తి విప్లవాన్ని కలిగించి తీరుతుంది. అది ఫలకారి కాకపోతుందా?

సాయంతరం పడేకొలదీ ప్రకృతి రామణీయకం అధిక మౌతోంది. చిలకలూ — గోరింకలూ కిలకిలారింత లాడు తూన్నై. కొమ్మల ఒడులలో కూర్చుని కోయిళ్ళు ముద్దులు పెట్టుకొంటూన్నై.

చెదరిపోయే పశువుల్ని అదలిస్తూ కూడగట్టుకొంటు న్నారు పశువుల కాపర్లు.

చేయి వారాపెట్టి - పడమర చూచి-ఏదో మాట్లాడు తూంది ఒక కూలీపడుచు కామందుతో. 'చీకటిపడిపోతోంది- పిల్లాడు ఏడుస్తూంటాడు- బాబు! వెళ్ళి-వండి-గంజికాచు కోవాలి- పోనిస్తురా?' అని అడుగుతోన్నట్టుంది.

'వీల్లేదు' అన్నట్టున్నాడు కామందు- పాపం మళ్ళీ పని చేస్తూంది ఆయమ్మ దీనంగా.

పశువుల్ని కూడగట్టుకొని నాదారికే వస్తూన్నాడు ఒక కుర్రాడు.

ఏదో అనబోయాడు- కాని గొంతుక రాలేదు. మళ్లీ అనబోయాడు-మళ్ళీని ... ...

'కో' అన్నాడు కడకి. 'కో' అని కూస్తూంది ఈ ప్రక్క మామిడిచెట్లలలో ఒక కోయిల. దాన్ని వెక్కిరిస్తూన్నట్టు న్నాడు.

'కో' అంది కోయిల. 'కో' అన్నాడు కుర్రాడు.

ఆ కంఠం సంస్కారం పొందింది పాడడంలో. యీ కంఠం సంస్కారం లేంది.

'కో' అంది కోయిల, 'కో' అన్నాడు కుర్రాడు.

దానికి పాడడమే పని. ఇతనికి నిత్యమూ ఎండల్లో మాడడమే కర్మం.

ప్రొద్దుటినించీ అది ఆకులనీడలలో కూర్చుంది భాగ్యవంతుల బిడ్డలాగ. కమ్మని చిగురాకులు తింటూంది తీయని పూదేనె త్రాగుతూంది.

మరి ఇతడో?

ప్రొద్దుటే పోయాడు పశువులకూడా పొలంలోకి-చద్దిగంజి త్రాగి ఆ ఎండలలో మాడాడు పగలంతా. గొంతు ఆర్చుకుపోతోంది. ప్రేగులు మండుతూన్నై. ఆకలి పేల్చేస్తూంది.

ఆ పిట్ట ధూకుతుంది చెట్టు చెట్టుకీ- కలవాళ్ళయింటి ముగ్ధలాగ. ఈ బిడ్డ నడుస్తూన్నాడు నిస్సత్తువగా-శవంలాగ-పశువుల వెనకాల.

'కో' అంటూంది కోయిల. 'కో' అంటూన్నాడు కుర్రాడు-మానకుండా-పట్టుదలతో.

పందెం వేసుకచూపు చూస్తుంది కోయిల. కాని—లంక మిరపకాయల కారం చూపు చూచుకొంటున్నాడు కుర్రాడు తన దుస్థితివంక. అలవాటుగా కోయిల కూతకి 'కో' అంటూన్నాడేగాని తన దృష్టిఅంతా తన దీనగతి మీదే వున్నట్టు కనపడుతున్నాడు.

ఎప్పుడు ఇంటికిపోదునా—ఎప్పుడు కాసన్ని వేణ్ణీళ్ళు కంఠంలో పోసికొందునా–లాక్కుపోయే కాళ్ళని, పీక్కుపోయే శరీరాన్ని, ప్రపంచనో ఎప్పుడు చేర్తునా—అని ఆత్రంతో తోల్తున్నాడు పశువుల్ని.

కోయిలగొంతు పెగిలిపోతోంది. కుర్రాడిగొంతు సన్నగిలుతోంది. అన్యథా ఎలాగ? గొంతులో తడేదీ?

'కోకోకో' అని ప్రారంభించింది కోయిల. కళ్ళెర్రజేసి దానివంక చూచాడు.

'అబ్బాయీ!' అన్నాను. 'దానితో పందెం ఎందుకు? దానికేం? అది సుకుమారి.'

'నేను కష్టజీవిని' అన్నాడతడు. 'నా మాట ముందు సాగాలి–నేను పందెంలో గెలవాలి'

సఖా!

'...చావలేదు, చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర.'

అన్నమాట నాకు గప్పున జ్ఞాపకం వచ్చింది—

'కూలీలు పూర్తిగా దాస్యానికి అలవాటైపోలేదు. అలా అలవాటైపోవటంకూడా మానవస్వభావం కాదేమో, యే మూలనో ఒకమూల స్వేచ్ఛాలేశాలు నెరుస్తూనే ఉంటవి.

వాటిని ప్రజ్వలింపచేస్తే విజయం సుసాధ్యం' అని అనుకొన్నాను-

'నేను గెలవాలి' అన్న పట్టుదల యువకునికి స్వభావం. ఆ స్వభావాన్ని 'నీవు గెలవలేవు' అన్న అభ్యాసంతో కప్పేస్తున్నారు పెద్దలూ-పాలకులూ.

'నేను గెలవాలి!'

ఎంత చక్కని సిద్ధాంతం!

'కోయిల పందెంలో నేనా-అన్ని విషయాలలోనూనా?' అని ప్రశ్నించాను.

తేరి నా మొగంవంక చూచాడు. నా ప్రశ్న అర్థం అయినట్టుంది.

'అన్ని విషయాలల్లోను. కాని-' అని ఆగాడు. పెద్దల చాకిరీ కంపు అప్పుడే కొట్టినట్టుంది పాపం ఇతడికి.

'కాని...?'

తన కామందును తప్ప తక్కిన ప్రపంచాన్ని అంతనీ ఎదిర్చి గెల్చేలా కనిపించింది ఇతని మానం.

మిత్రమా! కామందు అంటే ఎంతభయం అనుకొన్నావు? తిండి పెట్టక మాడ్చడమే కాకుండా చావదన్ను తాను అతణ్ణి ఎదిరిస్తే-గత్యంతరం కనబడదు.

ఇలాంటి కోయిల పంచాలతోను- గుర్రం పందాలతోను, తీరిపోతోంది 'నేను గెలవాలి' అన్న ఆ కాంక్ష. ప్రత్యక్షప్రపంచాన్ని ఎదుర్కొనేటప్పటికి వీరిలో ఇక మిగిలి వుండేది వొక పిరికితనమే- నీరసం- నిస్పృహ.

కోయిల అలా నేకూస్తుంది దూరంలో. అది కూసినప్పు డల్లా చెవులు నిక్కించి వింటూ నేవున్నాడు యీ కుర్రాడు. తిరిగి తిరిగి చూస్తూనే వున్నాడు.

మన జాత్యాభివృద్ధిని పెద్దలూ——పాలకులూ——అరికడు తున్నారనడం నిజం. 'నీవు ఎందుకూ పనికిరానివాడివి' అని మొదటినుంచీ నేర్పేస్తారు పిల్లలికి. అలా నమ్మిస్తారు. తమ లాగే దాసానుదాసులుగా తయారుచేస్తారు-

ఈ ఘోరం మాకూలీ తెగలో మరీ ఎక్కువ. పిల్ల వాడు నడవడం ప్రారంభించగానే పాలేరుతనాలకి తోల్తారు. ఐదు సంవత్సరాల ప్రాయంనుంచే అర్జన ప్రారంభిస్తాడు మగ వాడు. ఏభై సంవత్సరాలకీ అదే అర్జన పెరగదు గొర్రెతోక లాగ!

'నీవు పాలేరుతనానికే పుట్టావు, కామందు ఏమి చెప్పితే అది చేయాలి. ఎదిరిస్తే పాపం' అని నేర్పుతారు, అదే చదువు వాళ్ళకి-

మేము పల్లె చేరుకొనేటప్పటికి చాలా చీకటైపోయింది. మనుష్యా, మనుష్యా ఏకం అయిపోయాయి-

'ఇప్పుడేమి చేయాలి నీవు?' అని అడిగాను-

'దూడలిని కట్టివేయాలి, పాలు పితకాలి, గడ్డి వేయాలి, దూడలు పాలు విడిచిందాకా వుండాలి- ఇంట్లో కామందు గారికి పనులు చేయాలి-వారు పొమ్మన్నదాకా పోగూడదు' అన్నాడు-

'భోజనం కామందుల ఇంటిదగ్గరేనా?' అన్నా-

'కాదు-ఎప్పుడైనా పెడితే పెడతాను. కాని పెట్టాలి అనిలేదు. మా అన్నమ్మవుంది-ఉంటే తింటాం- లేకపోతే పసు కొంటాం గూటాపక' అన్నాడు- 'మాడలు పోతోనైన్నా- వెడలాను' అని చెప్పి వెళ్ళిపోయాడు.

రక్తం పిండిపోస్తారు తన కామందులికి, కాని అంత రక్తాన్ని తిరిగి పుచ్చుకోవడం చేతకాదు.

నలిసి పోతున్నాను చీకట్లో. కాని ఆనుగు అడుక్కీ- గుండెలలో గుచ్చుకుంటూన్నా ఆవేదన్ను. ఆకు హాడి 'నేను గెలవాలి' అనే పట్టుదల ఎలా నాశనమైపోతోంది!

ఈ ప్రక్క సౌభాగ్యాన్ని, సౌకుమార్యాన్ని చూచి- ఆ ప్రక్క ఆకలిమంటలూ, అస్థిపంజరాలూ ఏల కంటగించు కోవడంలేదు?

'ఈ సాంఘికాంతరాలు మాకు కిట్టవు. ఒకళ్ళక్రింద మేము చాకిరీ చేయలేం' అని ఎదిర్చిన తక్షణం కూలిపోవేం ఈ కులతత్వాలు?

కాని-ఈ తపగబడే శక్తి అరికట్టబడుతోంది. అబలత్వం అలవడుతోంది. అబలత్వానికి స్వార్థం పైకోడు. ప్రపంచానికి తాను పనికిరానను కొన్నవాడు తనకి తానైనా పనికిరావడానికి ప్రయత్నిస్తారు. తనకు తానూ పనకిరాలేని వాడు కుత్సితమార్గాలు అవలంబిస్తాడు.

ఈ కుత్సితమార్గాలే ప్రపంచంలో మెజారిటీ ఇప్పుడు- అయితే, ప్రపంచంలో మెజారిటీ అబలులేనా అని అడుగుతావు- ఔను అని జవాబిస్తాను- లేకపోతే ప్రపంచంలో మెజారిటీ దరిద్రులై వుండికూడా ధనస్వాముల నిరంకుశ

త్వాన్నీ- క్రౌర్యాన్నీ సహించుకోగలరా? మైనారిటీ భోగ లాలసులై వుండడానికీ- మెజారిటీ రెక్కలు ముక్కలుకొట్టు కొంటూ-చేతికీ నోటికీ అందకుండా బ్రతకడానికీ- కారణం వూహించుకోకుండా వుండగలరా?

నేను నా మిత్రుడి ఇంటికి పోయేటప్పటికి అందరూ పండుకొనేవేళ అయింది. గూటిలో కిరసనాలు బత్తీ వెలుగు తోంది. ఆ వెలుగులో ఏదో చూస్తున్నారు భార్యాభర్త లిద్దరూ.

సాయంకాలం రెండుగంటలకి ఇంటిదగ్గర బయలు దేరాను. ఈ మధ్య సంగతులన్నీ ఆ యిద్దరికీ వినిపించాను. ఆ వినిపించినవి వినిపించినట్లే నీకూ వ్రాస్తున్నాను. వారు పొందిన భావాన్నే నీవూ పొందుతావని నా ఆశ.

ఇక సెలవు.



ప్రియసఖా!

నీ లేఖ చాల చిత్రంగావుంది. కాని ప్రస్తుత సాంఘిక విధానానికి అనుగుణ్యంగానే వుందనుకొంటాను.

నీ బాకీదారులు బాకీలు చెల్లించుటలేదని నీవు ఆగ్ర హిస్తున్నావు. మా పెట్టుబడిదారులు మాటి మాటికీ అడుగు తున్నారనీ, వేధిస్తున్నారనీ, మేము వ్యధచెందుతున్నాము. కోక ఎరువిచ్చి పీట పట్టుకుని కూడకూడా తిరిగినట్లు వుందని నీవు విసుగుకొంటున్నావు. కష్టపడి, పనిచేసి, పండించి ధన

ముగా మార్చి. వారి యింట్లో మూటలుగట్టి, పట్టి చేతు లతో ఇంటికివచ్చి, పస్తులుపడి చావవలసి వస్తోందని మేము పరితపిస్తున్నాము. మా స్తివా పట్టణాలకూ పల్లెలకూ, ధనికు లకూ దరిద్రులకూ మధ్యవున్న అంతరమెట్టిదో? ఇట్టి పర స్పర విద్వేషాలతో సంఘం ఎంతకాలం ప్రశాంతంగా వుండ గలదంటావు?

నీవు మావూరువస్తే ఏ రైతునోటంటా 'ఋణబారం' అన్నమాటే పదేపదే వింటావు. ఏ కూలీ నోటంటా 'అప్పు' అన్నమాటే నీకు నిత్యమూ వినబడుతుంది.

పనులు చేస్తున్నప్పుడూ ఋణాలగురించే, ఇంటివద్దిర తీరుబడిగా కూర్చున్నప్పుడూ ఋణాలగురించే, మాట్లాడు కొనేటప్పుడూ ఋణాలగురించే చెప్పుకొని విచారిస్తూ వుం టారు ప్రజలు. విచారించి ఏమిచేస్తారు? విచారంలోనే నవ్వు కొంటూవుంటారు. ఆ నవ్వులు పెదవులుదాటి రావు.

'ఋణాలంటే మనకొక్కళ్ళకే కాదు. లోకంలో అందరికీవున్నై' అన్నాడు ఆ మూలగోడకు జేరబడి ముసుగు పెట్టుకొని కూర్చున్న ఒకవ్యక్తి.

'రాజూ! వున్నాయా? లేవనుకొన్నాను. ఒక్క పూటైనా నోటికి ఉప్పగా భోజనం చేయని మనవంటి దరిద్ర బ్రతుకులు ఇంకెక్కడైనా వుంటాయా?' అన్నాడు ఒక రైతు చుట్టకాల్చుకొంటూ చింతచెట్టు వేరుమీదకూర్చుని.

ముడ్డిక్రింద వేసికొన్న చెప్పులజోడు సర్దుకొంటూ రాజు 'వున్నాయి. ఎందుకులేవు? దమ్మిడీ అప్పుపెట్టి నక్కను ఎన్నితిప్పలు పెట్టింది భూదేవి?'

'ఎక్కడిసక్కా? ఎక్కడి భూదేవి? ఏదీ చెప్పరాదా వింటాం. చెప్పు చెప్పు. కథవింటూ అయినా కాసేపు కష్టాలు మరిచిపోవచ్చు.'

రాజు కథ మొదలుపెట్టాడు. ఆ కథనీవు వినదగిందే, కొంచెం చెపుతాను విను. పల్లెటూళ్ళ దీనులు కష్టాలుమరిచి పోవడానికి కష్టాలకథలే చెప్పుకొంటారు.

'ఒకసక్క వుందిట — దానికి భూదేవి ఒకదమ్మిడీ అప్పుపెట్టిందిట. అప్పుపెట్టి ఎక్కడపడితే అక్కడ నా దమ్మిడీ ఇవ్వవూ?' అనడం మొదలెట్టింది భూదేవి సక్కను'

'మన పెట్టుబడిదారులాగ.'

'ఈవేళ మాయింటికి వచ్చాడు. వాడిబాధ ఎవడు పడతాడని, ఇంట్లోవుండి 'లే' దనిపించాను.'

'నీవల్లా గన్నా చేశావు—పాపం ఆ సక్కగతి చూడు నీలాగే తప్పించుకోవాలని అదేపరుగున కొండమీదకు పరుగెత్తింది.'

'పోనీ తప్పించుకొంది.'

ఈ రైతు ఎంత అమాయకుడో అని నాకు నవ్వు వచ్చింది. నవ్వాను. అందరూ నావంక చూశారు.

'పట్నాలు తిరిగివచ్చిన పిల్లాడికి మా పల్లెటూరికథలు బాగుంటావా?' అన్నాడు రాజు.

'మీ కథకుకాదు నేను నవ్వుత. ఎంతో దీక్షతోటి వింటున్నాను' అని నమ్మకంగా అన్నాను.

'అక్కడమాత్రం భూదేవిలేదూ? అక్కడా అడిగింది 'నా దమ్మిడీమాట ఏమి చెప్పావు?' అని.

'భూదేవి దగ్గరనుంచే గామోసు నేర్చుకొన్నారు ఈ పెట్టుబడిదార్లంతాను బాకీదారుల్ని వేపుకతినడం.'

'ఎక్కడపడితే అక్కడే అడుగుతుంది దమ్మిడీ. నక్కకేమీ తోచిందికాదు పాపం. ఒక జొన్నచేను అడ్డంపడి పొతుంటే ఒకజొన్నకాడ కంట్లో గ్రుచ్చుకొని కన్ను పోయింది.'

'పాపం—మన సుబ్బన్న అప్పులవాళ్ళ బాధ పడలేక పట్టణం పారిపోయి రైలుకిందబడి చచ్చినట్టు!'

'కన్నుపోయి నక్క యేడుస్తుంటే – 'నా దమ్మిడీ?' అన్నది భూదేవి.'

'నాలుగు తన్నవలసింది భూదేవిని. నేను దగ్గిరవుంటే ఆ పని చేసేవాడిని' అన్నాడు ఒక యువకుడు.

'ఎవరి కష్టాలు ఎవరికి తెలుస్తవి? ఆ దమ్మిడీవల్ల భూదేవికి ఏమీ కాదు, కాని పాపం ఒకజీవనాన్ని మాత్రం ఏడిపిస్తుంది.'

'నక్క మనలాగ తెలివితక్కువది కాదు. జిత్తులమారి. ఏమన్నదో చూడండి– నీవు మంచినక్కకు పెట్టావా, గుడ్డి నక్కకు పెట్టావా, అప్పు?' అన్నది.

'బలేగా అన్నది.'

'మంచినక్కకే,' అన్నది భూదేవి.

'ఐతే నేను గుడ్డినక్కను. నన్ను అడుగుతావేం?' అన్నది నక్క.

'మంచిపనిచేసింది నక్క. భూదేవిపని అయింది' ఈ విధంగా అందరూ అప్పు ఎగగొట్టిన నక్కను మెచ్చుకొన్నారు. అంత మెప్పుపొందిన నక్క గుడ్డిది ఐతేనేం ?

మిత్రమా ! 'ఆ నక్క జర్మనీవంటి దేశాలకు మార్గదర్శిని అయింది ! మాకెందుకు కాగూడదు ?' అని అనుకొన్నాను నేను ఆఖరున.

కథ చెప్పుకొన్నారు. కాని కథవల్ల నీతియేమిటో ఎవరూ గ్రహించుకొన్నట్టు తోచలేదు. అప్పటికే రాత్రి వొంటిగంట అయింది. నక్క-వూసే చెప్పుకొంటూ ఎవరి యిండ్లకు వారు పోవడానికి లేచారు.

అంతరాత్రి వరకూ వుండి-అంత కథావిని - వారు గ్రహించుకొన్నదేమి ? వారు పొందిన లాభమేమి ? నాకు చాలా కష్టం కలిగింది. తమకథలో నీతినే తమకు కొంచెం బోధించాలని అనుకొన్నాను. అనుకోవడంతోటే 'నక్క లాగే మనంకూడా చేద్దాం రేపట్నుంచి' అంటూ లేచాను తిరుగలిమీదినుంచి. 'తిరుగలిమీద కూర్చున్నావు, తిరుగలి అరిగేవరకూ పెండ్లిఅవదు' అన్నది ఒకముసలమ్మ అందరూ నవ్వారు. కాని నా మాటను ఎవరూ వినలేదు.

ఆ రాత్రి జరిగిన సమాచారం ఇది. ఈ విధంగానే ప్రతిరోజునూ తమకష్టాల్ని మరిచిపోవడానికి ఏవో కథలు చెప్పుకొంటూ కాలం గడుపుతూ వుంటారు కృషికులూ, కార్మికులూను.

ఇదంతా తాత్కాలిక ప్రశాంతి. ఎంతకాలం ఈ విధంగా రోజులు గడుస్తాయి ? ఎంతకాలం కాలే కడుపును

కథలతో తృప్తిపరుస్తారు? ఎంతకాలం ఋణభారం సహిస్తారు, అవమానం భరిస్తారు?

ప్రపంచంలో ప్రశాంతి ఏర్పడాలంటే ప్రస్తుతంవున్న సాంఘిక విధానం పనికిరానట్టు తోస్తుంది. సంఘం పూర్తిగా మారిపోవాలి.

మానవసంఘంలో తక్కిన అన్ని చరాచర సంఘాల్లో వలెనే సమత్వం ఏర్పడాలి. స్వార్థం నశించిపోయి, సౌహార్ద్రం వృద్ధిపొందాలి. అప్పుడే నిజమైన, శాశ్వతమైన సౌఖ్యం ప్రపంచానికి కలుగుతుంది.

సఖా! అట్టి సమత్వం ఇంతలో కలుగుతుందా? మానవసంఘం ఇంతలోపరివర్తనం పొందుతుందా? మావంటి దీనుల కష్టాలు గట్టెక్కే కాలం సమీపంలో వుందా?

ఏమో! ఒక్కొక్కసారి ఏ చెట్టునీడనో కూర్చుని-ఆలోచించుకొంటుంటే భరింపరాని దుఃఖం కలుగుతూ వుంటుంది. మా వూళ్ళో సౌఖ్యాలు అనేవాటిని కలలో కూడా రుచిచూచి యెరుగని కష్టజీవుల్ని చూస్తున్నప్పుడు కడుపులో పేగులు చుట్టలు చుట్టుకొని పోతవి. సంఘ విధానాన్ని మార్చడానికి ఎవరు సమర్థులు?

రాత్రులు ఏవోకథలు చెప్పుకొని క్షణకాలంఅయినా కష్టాలు మరిచిపోతారు కాని రాత్రుళ్ళంతా యజమానులు, పెట్టుబడిదార్లు పీడిస్తున్నట్లే కలలుగంటారు. వేకువజామునే లేచి తిరిగి ఎవరిపనులకువారు పోతారు. ఇంతే. ఇదేవారి దినచర్య. ఇదే పల్లెటూళ్ళ జీవనగతి. ఈ గుడిగుడిగుంచం

బ్రతుకుతోనే, ఈ చాలీచాలని జీవితభృతితోనే, ఇదే విశాల ప్రపంచం అనుకొంటూ రోజులు గడుపుకొంటున్నవి పల్లెలు. మహర్షులు మెచ్చుకొన్న పల్లెలకు ఈ రోజులలో ఇంతకన్న మహదాశయం కనపడడంలేదు! ఈ మా జీవితగతుల్ని గురించీ, వీటిని తగువిధంగా మార్చే సూత్రాల్ని గురించీ ముందు, ముందు వ్రాస్తాను.



ప్రియసఖా!

నీ లేఖ అందింది. నా లేఖ ఆలస్యమైంది. నీవు ఆంధ్ర మహాసభలకు మద్రాసు వస్తావుగదా—అక్కడ నిన్ను కలుసుకోవచ్చుగదా—అని లేఖ వ్రాయలేదు నేను. కాని నీవు రాకనే పోతివి.

నీవంటి సారస్వతోపాసకులే—కవులే—అతిముఖ్యులైన ఇటువంటి మహాసభలకు రాక; పడకటింట్లలో—బృందావనటీరాల్లో—ఇసకతిన్నెల్లో - ఎలమావిగున్నల్లో - ప్రియురాండ్రతోటీ, ప్రణయగేయాలతోటీ, భావతిరంగాలతోటీ, శకుంత మిధునాలతోటీ; కులుకుతూ కూర్చుంటే; మావంటి జానపదులా మహాసమస్యల్ని పరిష్కరించేది?

పదిరూపాయిల బైరాగీటిక్కట్టుకొని మద్రాసు ప్రయాణమయ్యాను. నే నెప్పుడూ చెన్నపట్నంచూడలేదు. ఆంధ్ర తేజం వెల్లివిరిసే రోజుల్లోనే దాన్ని చూడాలి అనిపించింది.

రైలుఅంతా క్రిక్కిరిసివుంది. కూర్చోడానికి స్థలం లేదు. చాలామంది నిలబడివున్నారు. ఇద్దరు ముగ్గురు తెల్ల మొగాలు మాత్రం పరుపులు పరుచుకుని–బారచాచుకొని పడుకొన్నారు.

పెట్లోకి ఎక్కీ ఎక్కడంతోటే ఒక అతణ్ణి లేపి 'కాస్త జరుగు–కూర్చోవాలి' అన్నాను అతను కళ్ళెర్రజేసి తెర్ర ముగం చిర్రుమనిపించి ఏదో ఇంగ్లీషులో కసిరాడు. నేనూ నా పల్లెటూరి సత్తా అక్కడ వుపయోగించడానికి సిద్ధపడ్డాను. కాని నా చుట్టూవున్న 'ఆంధ్రు'లంతా – 'అరెరే ఆయన దొరగారు. మాట్లాడకు' అని నన్ను మందలించారు.

'ఇంతమంది ఆంధ్రపురుషులం వుండీ ఒక్క పరాయి వాణ్ణి లేవగొట్టలేకపోతిమే! పైగా, తోడి ఆంధ్రులంతా వాడితో ఏకమై వాడి ఆధిక్యతకూ – అధికారం చెలాయింపుకూ–దోహదం ఇస్తున్నారే! ఇదేనా ఆంధ్రపౌరుషం? ఆంధ్ర ప్రతిభ? ఆంధ్రవీర్యం?...'

హతాశుణ్ణి అయ్యాను. అందరితోబాటు నిల్చున్నాను.

రైలు వేగంతో పరుగెడుతోంది. ఎన్నో స్టేషన్లు వెనుకబడిపోతున్నాయి. అభివృద్ధి మార్గాన్ని బడి, ప్రపంచనాగరిక జాతులన్నీ ఇంతవేగంతోనూ పరుగిడుతుంటే–మనఆంధ్ర జాతి ఒక వెనుకబడిపోయిన స్టేషన్‌వంటిదిగదా అని వాపోయాను.

కాళ్ళు లాగుతున్నాయి కూర్చోడానికి స్థలంలేదు. పడుకునివున్న దొరగార్లు లేవరు. బండిఅంతా వెదికాను.

'20 జనులు కూర్చుండేది' అని వుంది. మందినంతా లెక్కపెట్టాను. ముప్పాతికమందికి తక్కువలేరు. 'ఈ తెలివితక్కువతనం—ఈ అబలత్వం—ప్రయాణీకులదా—రైల్వేవాళ్ళదా ?' అని అనుకొంటూ ఇంకో పెట్టెలోకి మారాను గాని అక్కడా ఇదే గోల.

యీ మాదిరిగా పొన్నేరిస్టేషన్ దాటిపోయింది. అక్కడినుంచి స్టేషన్ల పేర్లు ఇంగ్లీషులోనూ, అరవంలోనూ, తురకంలోనూ తప్ప— తెలుగులో లేవు!

నేను గోదావరీ స్టేషన్లో ఎక్కాను. అక్కడనుంచీ చూసుకొస్తున్నాను. ఏ స్టేషన్లో చూచినా— ఏ రైల్వే ఉద్యోగిని చూచినా— అష్టకట్ల అరవమొగాలే కనబడుతూ వచ్చాయి. మాజిల్లా కలెక్టర్ని చూశాను. ఆయన అరవవాడే. మాజిల్లా మునసబు అరవవాడు. మాసబ్ మ్యాజిస్ట్రేటు అరవవాడు. మా రిజిష్ట్రారు అరవవాడు, అంతా అరవవాళ్లే!

ఆంధ్రదేశంలో గ్రామమునసబు కరణాలు తప్ప ఉద్యోగస్థులంతా అరవలేనా? అయితే మన తెలుగువాళ్ళేమై పోయారు? ఈ రైల్వేస్టేషన్ల పేర్లు తెలుగులో ఎందుకు లేవు!

'మద్రాసు—ఆంధ్రసభలు!' అనీ— ఆంధ్రరాష్ట్రం తక్షణం ఏర్పడాలి' అనీ— 'మద్రాసు ఆంధ్రులది' అనీ— మొదలైన ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ, తమిళంలోనూ, తురకంలోనూ పెద్దపెద్ద అక్షరాలతో వ్రాయబడిన పెద్దపెద్ద ఖద్దరువస్త్ర తోరణాలు— నేను రైలుదిగేసరికల్లా కన్నుల పండువుగా కనబడతాయి అనుకున్నాను.

పట్నమంతా ఆంధ్రప్రతిభతో అలంకరింపబడుతుందనీ — మద్రాసులో వున్న 300000 మంది ఆంధ్రులూ, ఆంధ్రదేశంనుంచి వచ్చే లక్షలకొలదీ ప్రతినిధులు - నాయకులూ, కవులూ, గాయకులూ, నటకులూ, కళాపోషకులూ, సంఘసేవాపరాయణులూ, మంత్రులూ, సెక్రటరీలు, ప్రభుత్వోద్యోగులూ, విద్యార్థులూ—అంతా నగరవీధుల్లో ఊరేగింపులూ, ఉత్సవాలూ, జరుపుతూ వుంటారనీ-మేము రైలు దిగగానే రాష్ట్రగానాలూ, విజయగీతాలూ పాడుతూ వందలకొలది ఆంధ్రవాలంటీరు దళాలు స్టేషన్‌కువచ్చి మాకు స్వాగతం ఇచ్చి మహాసభకు తీసుకుపోతారనీ-అనుకొన్నాను.

కాని-అంతా పుళక్కి అయింది. అంతా నిరాశ అయింది. నిరుత్సాహంతో నా శరీరమంతా కంపించిపోయింది. కడకు- 'ఆంధ్రమహాసభలు ఎక్కడ, ఎక్కడ' అంటూ- వెతుక్కుంటూ తిరిగి తిరిగి- ఆ 'గోడపన్ను (వాల్ టాక్సు)' వీధిలోని దుస్సహమైన ఆ బొగ్గుపొగకంపు థియేటరును కనుక్కొనేటప్పటికి మా పెద్దలు దిగివచ్చారు.

పత్రికల్లో పెద్దపెద్ద హెడ్డింగులతో, ఫొటోలతో, ప్రకటితమైన నాయకుల ఉపన్యాసాలను చూచి మద్రాసులో ఆంధ్రసభలు మహాగొప్పగా జరిపారుఅని అనుకొంటావు. కాని ఈ సభలు ఏమాత్రమూ ఇంప్రెసివ్‌గా లేవు. ఆంధ్రుల గొప్పతనాన్ని ఏమీ ఇవి చూపలేదు సరిగదా ఇదివరకూ వున్న సద్భావాన్ని లేకుండా చేశాయి.

జాతీయనిర్మాణమూ - శిక్షణా - తమకు ఎంత అవసరమో ఇప్పటికైనా మన ఆంధ్రులు తెలుసుకోలేరు.

ఆంధ్రసభలు ఇలావున్నాయి. సరే, ఇక ఆంధ్రులు మాది అంటూన్న చెన్నపట్టణం ఎలావుందో చూద్దామని బైలుదేరాను.

రిక్షావాణ్ణి పిలిచి తెలుగులో మాట్లాడాను. వాడు అరవంలో మాట్లాడాడు, నాకు తెలియడంలేదు. 'నీకు తెలుగు తెలుసునా?' అని అడిగాను. వాడు అరవంలోనే జవాబు చెప్పాడు. అంతలో ఒక అడ్డకట్టు యువకుడు వచ్చి వాడితో అరవంలో మాట్లాడడం ప్రారంభించాడు నా తరఫుని. అంతటితో రిక్షావాడు తెలుగులో మొదలుపెట్టాడు— 'ఏమి సామీ! చాలా దూరంఫుండింది సామీ!...' అంటూ. అప్పుడు ఆ అడ్డకట్టుయువకుడుకూడా ధారాళమైన తెలుగు మాట్లాడాడు.

అసలుఖర్మం ఏమిటంటే—ఆ రిక్షావాడూ—ఈ యువకుడూ తెలుగువాళ్ళే! మద్రాసులో తెలుగువాళ్ళ స్థితీ— తెలుగుస్థితీ ఇలావుంది.

ఏ ట్రాములో చూచినా అరవమే. ఏ గోడమీద చూచినా అరవమే. ఏ ఎడ్వర్టైజుమెంటు చూచినా అరవమే. ఏ షాపుముందు చూచినా అరవమే. అరవానికి ఇంగ్లీషు జత. తెలుగుకు ఎక్కడా తావులేదు.

జనరల్ హాస్పిటల్‌లోకూడా— ఆయా సెక్షనుల పేర్లు ఇంగ్లీషులోనూ అరవంలోనూ తప్ప తెలుగులో లేవు.

తెలుగువాళ్లు తెలుగువాళ్లమని చెప్పుకోరు, తెలుగు వేషం వేయరు; తెలుగుభాష మాట్లాడరు—అడ్డకట్టు, లేక, సూటు— అరవం, లేక, ఇంగ్లీషు.

ఒకరు ఇద్దరు తప్ప, మద్రాసులో విరివిగా వర్తక వ్యాపారాలు సాగిస్తూన్న ఆంధ్రులు లేరు.

పెద్దపెద్ద ఉద్యోగస్తుల్లో కూడా ఆంధ్రశబ్దం లజ్జాకరంగా భావించి, 'అన్న'కు 'ఉన్' ఉసి-అయ్యకు 'అయ్యర్', అని వ్యవహరించబడుతూ గౌరవప్రతిష్టల్ని నిలుపుకొంటూ కాలం గడుపుతున్నవారు చాలమంది.

మద్రాసులో వున్న పాకీవారంతా ఆంధ్రులే!

ఆడయార్ దివ్యజ్ఞానసమాజంవారి ఇంటర్ నేషనల్ లైబ్రరీలో మీ కాకినాడ '-పరిషత్పత్రిక తప్ప మరే ఆంధ్ర పత్రికలూ లేవు.

తెలుగు ఆహారం దొరకాలంటే స్వయంపాకం మొదలెట్టవలసిందే. ఎక్కడ చూసినా సాంబారునీళ్ళే, ఆంధ్ర హోటళ్ళు ఎక్కడనాన్న వున్నా లేనట్టే లెక్క.

ఇలా ఎన్నని వ్రాయను! ఇవి ఒక్కరోజులో నేను మద్రాసు అంతా చూచినప్పుడు నాకు తగిలిన బాహ్య దృశ్యాలు. ఇంత అధ్వాన్నంగా వుంది మద్రాసు నగరం.

మద్రాసులో ఆంధ్రత్వం ఎక్కడా కనిపించ లేదునాకు.

ఆంధ్రుల్లో ముందుకు చొచ్చుకుపోయే గుణం చాలా తక్కువ. అదే యీ పతనానికంతకీ కారణం. మద్రాసు నగరం మనది అని మహోపన్యాసాలిచ్చిన ఆంధ్రమూర్తులు మద్రాసంతా ఆంధ్రత్వంతో నింపడానికి ప్రయత్నం చేస్తున్నారా!

ఈ మద్రాసు యాత్రవల్ల నాకు దుర్భరమైన-దుస్సహమైన అనుభవాలు కలిగాయి. సంఘనిజస్థితిని ఇప్పుడు కొంచెం అర్థం చేసుకోగలను. పట్టణ గ్రామజీవితాల తులమాన జీవితక్రమాన్ని ఇప్పుడు బాగా చిత్రించుకోగలను.

ఈ విషయాలన్నీ వచ్చేలేఖలో వ్రాస్తాను. పొలం పోవాలి, ఇప్పటికి సెలవు.

*